30-10-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :44 విడిప్రతి : రు. 2.00

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



సారా పొట్లాలే వైఎస్ అసమ్మతి శస్త్రాలు

సారా కన్నీళ్ళే ఎన్టీఆర్ ప్రచారోధృతి పవనాలు

సారాతో పివికి సీతారాం కేసరి ఎసరు యత్నాలు

## సారా ఉద్యమమా? రాజకీయ సుడిగుండమా?

ఏ శుభ ముహూర్తంలో సారా ఉద్యమం ప్రారంభమైందో గాని, రానురాను అంక రాజకీయ నినాదంగా, వివాదంగా పరిణమిస్తోంది. సారావల్ల వచ్చే కష్టాలు, కన్నీళ్లు, పేద కుటుంబాల వెతలు, మహిళల రోదనలు మట్టిలో కలిసి పోయాయి. అధికారం వైపు కోసం తలక్రిందులు తపస్సు చేస్తున్న రాజకీయ ఉన్మాదులకు మంచి కిక్కునిచ్చే సురాపానంగా పనిచేస్తున్నది. గోదావరి వరదలో కొట్టుక పోయేవాడు గడ్డిపోచను పట్టుకొని ఒడ్డుకు చేరడానికి ప్రయత్నించినట్లు రాజకీయ నిరుద్యోగులు, పదవీకాంత పరిష్వంగపు సుఖం పొందాలని ఉవ్విళ్లూరే వారు సారాయి ఉద్యమాన్ని ఆసరాగా చేసుకొని తమ భవిష్యత్తు నిర్మించుకోవడానికి తపన పడుతున్నారు.

ఎన్టీఆర్ సంగతి తెలిసిందే. ఈ ఉద్యమం వెనుక దాగివున్న రాజకీయ ప్రయోజనాల గనిని మొదటగా కనిపెట్టిన ఘనుడాతడు. సారా పేరుతో కన్నీళ్లు కారుస్తూ, ఊరూరు తిరిగి ప్రచారోధృతి పవనాలను ఝంఝామారుతంగా వీయింప జేస్తున్నాడు.' ఈనాడు' రామోజీరావు ఆయన నిర్వహిస్తున్న యజ్ఞంలో ఒక సమిధ. అత్యధిక సర్క్యులేషన్ ఆధారంగా ఆ పత్రిక ఎన్టీఆర్ సృష్టించే పిల్లగాలులను తుఫాన్ గాలులుగా మారుస్తున్నది. 82 లో ఆత్మగౌరవం నినాదం మాదిరి, ఇప్పుడీ వివాదాన్ని రచ్చ కెక్కించి, మహిళల మనసులు దోచి, ఓట్ల రాశులు క్రుమ్మరించుకోవడానికి వారు చేయని ప్రయత్నం లేదు. ఈ ఒక్క ఉద్యమ నినాదంతోనే రానున్న అసెంబ్లీ ఎన్నికలలో మిత్రపక్షాల ప్రమేయం లేకుండా భాగ్యనగరపు సింహాసన భాగ్యం పొందవచ్చునని వారు ఆశపడుతున్నారు.

ముఖ్యమంత్రిత్వం కోసం రెండేళ్ల పాటు కఠోర తపస్సుచేసి, అసమ్మతి యజ్ఞం నిర్వహించి విఫలుడైన డాక్టర్

### మా ప్రత్యేక ప్రతినిధి

వైఎస్ .రాజశేఖర రెడ్డి కూడా సారా ఉద్యమ ఊతంతో వినూత్న అసమ్మతి యుద్ధం ప్రారంభిస్తున్నారు. మొకాటి బిర్రు కల్గిన నాయకుడు కాబట్టి, నింద పడకుండా, తొలుత పులివెందల గ్రామాలలో నిషేధం అమలు జరిపిస్తున్నాడు. అది రాష్ట్ర వ్యాప్తంగా అమలు జరగాలన్నది వైఎస్ నినాదం. ఆ రూపంలో విజయభాస్కర రెడ్డిపై శస్త్రా_లు సంధించేందుకు సర్వసన్నాహాలూ జరుగుతున్నాయి.

ఈ ఉద్యమంలో మరో విచిత్రమైన మలుపు- కేంద్ర సాంఘిక సంక్షేమమంత్రి శ్రీసీతారాం కేసరి సమర్థన. సారాయిని దేశమంతా నిషేధించాలని, ప్రొహిబిషన్ వల్ల రాష్ట్రా_లకు కల్గే నష్టాన్ని కేంద్రం సగం పూడ్చాలని ఒక వింత వాదం లేవనెత్తాడాయన. ఇది సారా త్రాగి ఇల్లు, వళ్లు గుల్లచేసుకొనే పేదల పట్ల ప్రేమతో, ఆర్తితో చేసిన ప్రకటన అని ఎవరూ నమ్మడం లేదు. ఢిల్లీలో మొదలౌతున్న నూతన రాజకీయ పరిణామాలకు సూచనగా మాత్రమే అందరూ భావిస్తున్నారు. మొన్నటికి మొన్న .బెంగుళూరు వెళ్ళి, కర్ణాటక ముఖ్యమంత్రి బంగారప్పను పదవినుంచి దించడానికి లేదని బెదరింపు చేసి వచ్చిన వాడు శ్రీ సీతారాం కేసరి. బంగారప్ప తొలగింపు పివికి ఎంతటి ప్రతిష్ఠా సమస్యగా మారివుండేదీ అందరికీ తెలుసు. పార్టీకి కూడా ఆయన ఒక చీడపురుగు వలె, మహమ్మారి వ్యాధివలె మారివున్నాడు. ఆ పరిస్థితులలో బంగారప్పను కదిలించడానికి లేదని బహిరంగంగా ప్రకటన చేయడంలోని మర్మమేమిటి? ఆ అంతరార్థమే ఆయన సారాయి ఉద్యమ సమర్థనకూ వర్తిస్తుందని రాజకీయ పండితుల వివరణ.

కొరవ 7 పేజీలో



శ్రీ అంగీరస నామసంII పుష్య శుద్ధ అష్టమి శుక్రవారం నుండి మాఘ శుద్ధ అష్టమీ ఆదివారం వరకు - శాలికం 1914 పుష్యంనుండి మాఘం వరకు

జనవరి 1993 JANUARY

| తేది | ఉదయం | అస్తమయం |
|---|---|---|
| 10 | 6.32 | 5.28 |
| 20 | 6.28 | 5.34 |
| 30 | 6.23 | 5.37 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆది SUN<br>రాహు సా 4.30-6.00<br>యమ మ 12.00-1.30 | 31 | 3 | 10 | 17 | 24 |
| సోమ MON<br>రాహు ఉ 7.30-9.00<br>యమ మ 10.30-12.00 | ౦ పండుగలు ౦<br>1. ఇంగ్లీషు సంవత్సరాది<br>4. ముక్కోటి ఏకాదశి<br>5. రమణమహర్షి జయంతి<br>8. ఆర్ద్రోత్సవము<br>12. [illegible] జయంతి<br>13. భోగిపండుగ<br>14. మకరసంక్రాంతి ఉత్తరాయణ పుణ్యకాలం<br>15. కనుమపండుగ<br>16. సావిత్రీగౌరీవ్రతం<br>21. [illegible]<br>22. పుష్య అమావాస్య<br>23. [illegible]<br>24. [illegible]<br>26. [illegible]<br>27. వసంత పంచమి<br>30. శ్రీ గాంధీ వర్ధంతి<br>31. భీష్మాష్టమి | 4 | 11 | 18 | 25 |
| మంగళ TUE<br>రాహు సా 3.00-4.30<br>యమ ఉ 9.00-10.30 | | 5 | 12 | 19 | 26 |
| బుధ WED<br>రాహు మ 12.00-1.30<br>యమ ఉ 7.30-9.00 | | 6 | 13 | 20 | 27 |
| గురు THU<br>రాహు మ 1.30-3.00<br>యమ ఉ 6.00-7.30 | | 7 | 14 | 21 | 28 |
| శుక్ర FRI<br>రాహు ఉ 10.30-12.00<br>యమ సా 3.00-4.30 | 1 | 8 | 15 | 22 | 29 |
| శని SAT<br>రాహు ఉ 9.00-10.30<br>యమ మ 1.30-3.00 | 2 | 9 | 16 | 23 | 30 |

Vani Printing Works, NLR. Ph: 28876

# అన్నగారు వచ్చి వెళ్ళినా అనాధ స్థితి మారలేదు!

జిల్లా తెలుగు దేశం పార్టీ ఎవరికి పుట్టిన బిడ్డలా అన్నట్లుంది; అమ్మ, అబ్బ లేని అనాధ చందంగా తయారైవుంది. 1994లో అధికారం తమదేనన్న ఆశ ప్రతి తెలుగు దేశం వారిలో బలీయంగా కల్గుతున్నప్పటికీ, ఆ ఉత్సాహం, ఆ విశ్వాసం వారి పార్టీ కార్యక్రమాలలో ప్రతి ఫలించడం లేదు.

[illegible], మండలాలు ఆయుష్షులో ఉండినంత కాలం దేగా నారసింహారెడ్డి గారు పార్టీ బ్రతికి వుందన్నట్లు అప్పుడప్పుడు పత్రికల కెక్కుతుండే వారు. మండలాధ్యక్షులు, ఇతర తాలూకా స్థాయి పచ్చలక్కాలకు వెళ్లారు వస్తే ఆయన ఇల్లు ఒక చిరునామాగా వుండేది. కేరాఫ్ అడ్రసుగా పనిచేసేది. పదవి పోవడంతో ఆయన వ్యాపారాలలో మునిగిపోయారు. రాజకీయాలకు క్యాజువల్ లీవ్ పెట్టేశారు. ఎమ్పీగారు కొంతకాలం జిల్లా కన్వీనర్ హోదాలో దర్పం ప్రదర్శించడానికి ప్రయత్నించినా, ఆ పాత కాలపు తోలు బొమ్మలాటలు చిరంజీవి స్టయిల్ సినిమాలు చూడడానికి అలవాటు పడిన ఇప్పటి యువతరానికి వెగటు కల్గించాయి. దానితో ఆయన 'సిక్ లీవ్' పెట్టి కోటలో కృష్ణారామా అంటూ పొద్దు గడుపుతున్నారు. రమేష్‌రెడ్డి తాటాకుల మంట వంటివాడు. వెలిగితే గుప్పున అంటుకొని వెలుతురంతా తనదేనని ప్రదర్శిస్తాడు; అప్రక్క క్షణంలోనే గుబ్బనప్పుడు కాకుండా చల్లారిపోతాడు. రమేష్ రెడ్డికి ఎనిమిదేళ్ల రాజకీయానుభవం వున్నా, ఇప్పటికి ఎన్ఎంఆర్ స్థాయిలోనే వున్నాడు తప్ప, పర్మినెంట్ రాజకీయోద్యోగిగా కుదురుకోలేక పోతున్నాడు. అన్నగారు వస్తేనే ఆయనకు పూనకం వచ్చేది; ఆయనటు వెళ్ళగానే తానూ జారుకుంటాడు. జిల్లా నుంచి వచ్చే ఏ తాలూకా, గ్రామ నాయకుడు కూడా ఆయన్ను కలవరు; తమ నాయకుడిగా గుర్తించరు.

**జిల్లా తెలుగు దేశం పార్టీకి అధ్యక్షుడిని వెతకలేక పోతున్నారు!**

కొత్త బిచ్చగాడు- శ్రీసోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిపై మేనమామలిద్దరి అంశ ప్రభావం వుంది. నూటికి నూరణాల కోటమార్కు రాజకీయం చేయడంలో నేర్పరి. చిన్నప్పుడు అమ్మపోయాల్సిన ఉగ్గు, మేనమామలు పోశారేమో తెలియదు మరి! కొత్త కదా - పొద్దెరగక తిరుగుతున్నారు. కాని, శాల్తీ మరీ బక్కపలచనైనది; కంటి నిండా ఆనదు. అందుకే నాయకుల సరసన కూర్చోవడం తప్ప, నాయకత్వం అబ్బడం లేదు. సారాయి ఉద్యమానికి ట్రాక్టరులో జనాన్ని తోలడం మినహా, పార్టీలో పైకెక్కి రాలేక పోతున్నాడు.

పెళ్ళకూరు ప్రభాకరరెడ్డి మరొక తాజా సరకు. అతడికి నల్లపరెడ్లపై ద్వేషం; పార్టీలో వున్న వారంతా నల్లపరెడ్ల అంతేవాసులే. ఎవరూ దగ్గరకు చేరనివ్వడం లేదు. ఎన్టీఆర్‌కు పితూరీలు చెప్పే వారు ఎక్కువ; వాటికి సమాధానాలు చెప్పడానికే సమయం చాలడం లేదు. డాక్టర్ల జంట ఒకటి వుంది. వీరిద్దరికీ రాజకీయాలు పార్ట్‌టైం జాబ్ క్రింద లెక్క. ఆస్పత్రులలో రోగులను, వారిచ్చే డబ్బు లెక్కలను చూసుకోవడానికి పోను మిగిలిన సమయంలో పార్టీ సంగతులు చూడాలి. ఏ కార్యకర్త వారిని నమ్మి, దగ్గర చేరుతాడు?

ఎవరికి వారు ఏమీ పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో జిల్లాలో తెలుగు దేశం పార్టీ అనాధగా తయారైంది. అన్నగారి జిల్లా పర్యటన సైతం వారిలో

కొరవ 7 పేజీలో

## పినాకిని తీరం

### అంపశయ్య మీద ఆచార్యుడు!

ఆనాడు భీష్మాచార్యులు అంపశయ్యపై పరుండినాడని భారతంలో చదవడం తప్ప మనం చూడలేదు. మొన్న హైదరాబాద్ 'నిమ్స్' లో చికిత్స పొందుతున్న ఆచార్య రంగాను చూచినపుడు అంపశయ్య మీద వుండినాడన్న ఆ ఆచార్యుడు మదిలో మెదిలాడు. ఆనాడు ఆ ఆచార్యుడు అంపశయ్య మీద పరుండినాడో లేదో కాని, ఈనాడు ఈ ఆచార్యుడు మాత్రం అంపశయ్య మీదనే వున్నారు. ఆయనలో ఆ బాధ లేశం కూడా వున్నట్లు లేదు కాని, చూచే వారి మనసు మాత్రం మనసులో వుండడం లేదు; అక్కడ ఎక్కువ సేపు వుండడానికి కాలు నిలువడం లేదు.

రంగాగారు ఇటీవల పడ్డారట. తొంటి వద్ద కాలు ఎముక విరిగింది. ప్రయివేటు నర్సింగ్‌హోంలో చేర్చారు; ఆపరేషన్ చేసి ఎముకను అతికారు; రంగాగారి స్వంత మాటలలో - "ఆపరేషన్ చేశారు, ఏదో చక్రం లాంటిది అమర్చి కుట్టేశారట, తర్వాత కుట్లు విప్పారు. ఆపరేషన్ చేసినపుడు గాని, కుట్లు విప్పినప్పుడు గాని నొప్పే తెలియ లేదు, చాలా మంచి డాక్టరు" -ఇవి ఆయన మాటలు. కాని తర్వాత ఇన్‌ఫెక్షన్ వచ్చింది. చర్మమంతా నల్లగా మారింది. విపరీతమైన దురద. మంత్రి శ్రీ రోశయ్య దాన్ని చూచి బలవంతం చేసి తీసుకొనివచ్చి 'నిమ్స్' లో చేర్చారు; అక్కడ చికిత్స తర్వాత కొంత మెరుగని చెప్పారు.

అస్వస్థులుగా వున్న రంగాగారిని చూచే ముఖ్య సందర్శకులు అసంఖ్యాకంగా వున్నారు. శ్రీ జనార్దనరెడ్డి దంపతులు ఆయన్ను ప్రయివేటు నర్సింగ్ హోంలో చూశారట. పదవి పోయినందుకు విచారపడ వద్దని భరోసా ఇస్తూ ప్రోత్సాహకరంగా ఏదో మాట్లాడారట రంగా గారు. అవి అనారోగ్యం వల్ల ధోరణిగా వచ్చిన మాటలనుకున్నట్లుంది వారు. నర్సింగ్ హోంలో వారిని చూచిన సమయంలో పరిస్థితి ఆ విధంగానే వుండినదేమో! అప్పుడు ఆయన పరిస్థితి బాగాలేదని రోశయ్యగారు కూడా అన్నారు. 25 తేది నేను 'నిమ్స్' లో చూచినపుడు నాకు ఆ విధంగా అనిపించలేదు; మాటలలో తొందరపాటు తబ్బిబ్బులేమీ కనుపించలేదు; మామూలుగా వుండినారు. ఆయన మాటల ధోరణి కొత్తగా వినే వారికి ఇదేమిటి అనిపిస్తుంది. ఆ స్థితిలో ఎక్కువగా మాట్లాడి ఆయనకు శ్రమ ఇవ్వకూడదని ఐదు నిముషాల తర్వాత రాబోతే, కూర్చునే వరకు వొప్పుకోలేదు. రాష్ట్ర రాజకీయ పరిణామాల గూర్చి రెండు మాటల్లో రంగా గారు తన అభిప్రాయం వ్యక్తం చేశారు. ఆయన అభిప్రాయం ఎంతో స్పష్టంగా, నిర్మాణాత్మకంగా, కుండ బ్రద్దలు కొట్టినట్లు వుండింది. ఆ వ్యాఖ్యను బట్టి అనిపించింది -రంగా గారి ఆలోచనా శక్తిలో మార్పులేదని!

'జమీన్‌రైతు'ను గూర్చి రంగాగారు ఎన్ని వివరాలు ఎంత

కొరవ 10 పేజీలో



## శ్రద్ధాంజలి

**పచ్చిపాల రామచంద్రారెడ్డి గారు**

కోవూరు

22.10.1992 తేది స్వర్గస్థులైనారు

వారి పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**వారి ఉత్తరక్రియలు**

31.10.1992 తేది శనివారం

కోవూరులో మా స్వగృహమున జరుగును.

**పచ్చిపాల వెంకురెడ్డి (సోదరుడు), ప్రమీలమ్మ**

| సోదరుని కుమారులు | - | కోడళ్లు |
|---|---|---|
| పచ్చిపాల రవికుమార్ రెడ్డి | - | శ్రీవేణి |
| పచ్చిపాల కృష్ణకుమార్ రెడ్డి | - | భారతి |
| పచ్చిపాల మల్లికార్జున రెడ్డి | - | అపర్ణ |
| కుమార్తెలు | - | అల్లుళ్లు |
| తనమాలి శోభారాణి | - | డా. శ్రీనివాసులు రెడ్డి |
| అనవల్లి పద్మలత | - | మస్తాన్ రెడ్డి |

మనుమళ్లు: నన్నీష్, దినేష్

# జమీన్‌రైతు

## బందిపోట్ల బెడద

నక్సలైట్ల బెడద ఒకవైపు రాష్ట్రాన్ని క్రుంగదీస్తుంటే, ఇంకొక వైపునుంచి బందిపోట్లు ప్రజలను హడల గొట్టేస్తున్నారు. రెండు వారాల నుంచి నెల్లూరు, రాయలసీమ జిల్లాలలో తిరుగుతూ, కన్పడిన వారందరినీ దోచుకుంటూ, అడ్డువస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చిచంపుతూ భీభత్సం సృష్టిస్తున్న దోపిడీ ముఠాలను అరికట్టడంలో పోలీసు ఇంకా సఫలీకృతం కాలేక పోతున్నది. చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలోవీరు ఇప్పటికి నలుగురిని బలితీసుకున్నారు; దాదాపు 30మందిని గాయపరిచారు.మూడు జిల్లాల పోలీసులు మూకుమ్మడిగా అన్వేషణ సాగిస్తున్నా, రాత్రి పగలు తిరుగుతున్నా, కుక్కలను సైతం రప్పించి వాసన పట్టడానికి యత్నిస్తున్నా బందిపోట్లు మాత్రం చిక్కడం లేదు. వారు తిని పారేసిన ఎంగిలాకులు, త్రాగిపారేసిన సారా సంచులు మాత్రం లభిస్తున్నాయి.

సమాచార వ్యవస్థ, వాహన సౌకర్యం విస్తృతంగా అభివృద్ధి చెందిన ఈ రోజులలో కూడా దోపిడీ ముఠాల స్వైర విహారం నివారించ లేక పోవడం దురదృష్టకరం; సాధారణ దోపిడీలనైతే సహించవచ్చు; ఆస్తినష్టం భరించవచ్చు; కాని, నిర్దాక్షిణ్యంగా కుత్తుకలు కత్తిరించే కసాయి మూకలు విచ్చలవిడిగా తిరుగుతుంటే బ్రతికేదెట్లా? నిష్కారణంగా తుపాకి పేల్చి,పిట్టల్ని కాల్చినట్లు మనుషులను కాల్చుకుంటూ వెళ్ళేవారిని వూరకే వదిలి పెడితే ఎట్లా? గ్రామాలలో ప్రజలు ఈ దోపిడీ వార్తలు విని ప్రాణాలరచేతిలో పెట్టుకొని బ్రతుకుతున్నారు; రాత్రిపూట నిద్రకు దూరమై జాగరణ చేస్తున్నారు. పోలీసులు ఈ సమస్యను సవాల్‌గా పరిగణించి, తమశక్తి యుక్తులన్నింటినీ వినియోగించి, వీరి ఆట కట్టించడం అవసరం.

దోపిడీలు జరిగిన తర్వాత వారికోసం వెతుకులాడడం కాకుండా, ఇటువంటి దుర్మార్గాలు తలెత్తకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్తలు తీసుకోవడం; దోపిడీ జరిగే అవకాశమున్న పల్లెలలో,నగర శివారు ప్రాంతాలలో గస్తీఏర్పాట్లు విడవకుండా కొనసాగించడం జరగాలి.

ఇటువంటి కిరాతక దోపిడీ ముఠాల కోసం ప్రత్యేక చట్టాలు రూపొందించడమూ అవసరమన్పిస్తుంది. కోర్టులు, బెయిళ్ళు, సాక్షులు, వాదోపవాదాలతో వీరిని శిక్షించ బూనుకొంటే ఫలితం వుండదు. కన్పిస్తే కాల్చి వేసేందుకు పోలీసుకు అధికారం ఇస్తే తప్ప వీరిని అదుపు చేయలేరు.

## కొత్త బియ్యం పథకం

ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి మధ్యతరగతి కుటుంబీకుల ప్రయోజనార్థం కొత్త బియ్యం పథకం ఒకటి ప్రకటించారు. సాధారణ రేషన్ కార్డు కల్గిన ప్రతి ఒక్కరికీ నెలకు 20 కిలోల బియ్యం కిలో రు.5.00 లకే ఇస్తారట. పేద, బలహీన వర్గాల వారికిచ్చేది సబ్సిడీ బియ్యం పథకమైతే , ఇది లెవీ బియ్యం పథకం. మొదటి దానిలో ప్రభుత్వ వ్యయం ఇమిడివుంది; ఈ పథకానికి ప్రభుత్వానికి కాణీ ఖర్చు కాదు.కాని, ఆమేరకు మిల్లర్లకు సౌకర్యాలు సమకూర్చాలి; లెవీ విధానంలో మార్పులు తేవాలి.

ఓట్ల బ్యాంకులో పేద వర్గాలది ఎంత శాతమో, మధ్యతరగతి కుటుంబీకులదీ అంతే శాతం. అయితే వారివలె వాలె పోలింగుకు వెళ్ళరు; ప్రభుత్వాల ఎంపికలో తమ సత్తా ప్రదర్శించరు; ఒక వ్యవస్థీకృత వర్గంగా వ్యవహరించరు. అందువల్లే ఏ ప్రభుత్వం కూడా జనాకర్షక పథకాల రూపకల్పనలో నైనా పేదవారిని పరిగణనకు తీసుకుంటున్నదే తప్ప, మధ్యతరగతి వర్గాలను లెక్కచేయడంలేదు. విజయభాస్కరరెడ్డి ఆ పుణ్యం కట్టుకుంటున్నారు. ఐదు రూపాయలకు కిలో బియ్యం సరఫరా చేయడం ద్వారా సగటు మనిషి ఆర్థిక జీవనంలో పెద్దమార్పు రాకున్నా, తమ గతి పట్టించుకునే వారున్నారన్న ఆత్మ సంతృప్తి వారిలో కల్గుతుంది.

అయితే ఒక్క బియ్యంతో సరి పెట్టుకోకుండా తక్కిన నిత్యావసర వస్తువుల ధరలూ సామాన్యుడికి అందుబాటుకు తేవడానికి విజయభాస్కరరెడ్డి ప్రయత్నిస్తే ప్రజలు మరింత సంతోషిస్తారు. పప్పుదినుసులు, కూరగాయలు, వంటనూనెలు వంటి వాటిరేట్లు దినదినానికి పైకి ఎగబ్రాకుతున్నాయి. కేవలం ప్రభుత్వ కంట్రోళ్లవల్ల వీటి ధరలు అదుపు చేయడం అసాధ్యం. ఆయా పైర్లు, పంటలు విస్తారంగా సాగుచేసేందుకు తగిన వసతులు సమకూర్చి, ఉత్పత్తి పెంచడం ద్వారా మాత్రమే వ్యవసాయ ఉత్పత్తుల ధరలు తగ్గుతాయి. సరైన మార్కెటింగ్ సౌకర్యాలు లేక పోవడం కూడా ధరల అస్తవ్యస్థతకు ఒక కారణం. ప్రతి ప్రధాన పట్టణంలో శీతల గిడ్డంగులు వుంటే కూరగాయల ధరలు నిలకడగా వుంటాయి. ఒక సీజన్‌లో ధరలు పడిపోయి రైతు నష్టపోవడం, మరుసీజన్‌లో ధరలు ఆకాశానికెగసి వినియోగదారుడు కష్టపడడం వుండదు. ప్రభుత్వం తాత్కాలిక ఉపశమన చర్యలతో పాటు దీర్ఘకాలిక ప్రణాళికలూ రచించి, అమలు చేస్తే రాష్ట్రం బాగుపడుతుంది.

## జమీన్‌రైతు

[జమీన్‌రైతు రేపు (31 తేది) సాయంత్రం నూతన గృహప్రవేశం జరుపుకోనున్నది; ఈ సందర్భంగా 1947 మే 16 తేది నాటి సంచికలోని, జమీన్‌రైతుకు 45 ఏళ్ల పాటు నీడనిచ్చిన తిప్పరాజు వారి వీధి భవనం ప్రవేశోత్సవ వార్తను పునఃప్రచురిస్తున్నాము]

### "జమీన్‌రైతు" నూతనగృహప్రవేశోత్సవం

2 తేది రాత్రి అర్యధర్మ సూత్రాల ప్రకారం గృహప్రవేశం జరిగింది. 12 సాయంకాలం అధునాతన వేదబుక్కుల ననుసరించి టీ పార్టీ అనెడి ఉపాహారసహిత కాఫీ పార్టీ జరిగింది. ప్రముఖులంతా విచ్చేసి పాల్గొన్నారు. విజయాక్షతలు చల్లారు. రాజాలని పెద్దల ఆశీస్సులు, సందేశాలు, కట్నాలు ఇవి.:

### ది నేషనల్ స్టాండర్డు

బి. హనుమంతరావు, అసిస్టెంటు ఎడిటరు — న్యూస్ పేపర్‌హౌస్ కోలాబా - బాంబే ఏప్రెల్ 29, 47

జమీన్‌రైతు సంపాదకులు
శ్రీ నె. వెం. రామానాయుడు గారికి
మిత్రమా!

ఇంతకాలమున్నైనను "జమీన్‌రైతు" కు ఒక స్వంత భవనము ఏర్పడనుం డెనని తెలిసికొని చాలసంతోషించితిని. మన దేశమున ఇప్పుడిప్పుడే దేశభాషా పత్రికలు తలయెత్తగల్గుచున్నవి. స్వంత భవనములుగల దేశభాషా పత్రికల సంఖ్య బొంబాయి నగరమునకే రెండు

### పాత సంపుటాల్లో...

వానిలో ఒక పత్రిక ఆంగ్లపత్రికతో కలసి యున్నది. ఇట్లుండ, ఎన్నో కష్టములకు బెదిరింపులకు ఓర్చి మీ యాజమాన్యమున నడపబడుచుండెడి పత్రికకు స్వంత భవనమేర్పడెనని విని దూరరాష్ట్రమున నుండెడి నేను ఎంతో ఆనందమును చెందితిని.

పత్రికలను నడుపుట సామాన్య ముగాదు, ఎంతో సొమ్ము ఉండవలెను. ఆంగ్లభాషా పాండిత్యమున్నగాని తెలుగున సయితము నడుపుట కష్టమని అనేకులు తలంచు చుందురు. కాని సొమ్ము లేకున్నను, ఆంగ్లభాషను నేర్చుకొనుటకై ప్రత్యేకముగ ఒక విద్యాలయమునకు వెడలకున్నను, మీ పట్టుదల, మీ సమయస్ఫూర్తి, మీ ఆంధ్రభాషా పరిజ్ఞానము, మీ దేశభక్తియే యీ జమీన్‌రైతు పత్రికను ఇంతటి ఉన్నత స్థితికి తెచ్చినది. ఆంధ్రదేశమంతయును గర్వపడదగిన విషయమిది.

ఇట్లు
పాత స్నేహితుడు,
జమీన్‌రైతు చదువరి
భైరవరసు హనుమంతరావు.

శ్రీ నెల్లూరు వెంగళ్రామానాయుడు గారు
జమీన్‌రైతు -నెల్లూరు.

ఆర్యా,
నూతన గృహప్రవేశంతో మీ "జమీన్‌రైతు" పాటి రైతులోకంలో ప్రబోధం కల్గిస్తూ, యితఃపూర్వం కన్నా ఎక్కువ అభివృద్ధికి రావాలని హృదయపూర్వకంగా కోరుతున్నాను.

మిత్రుడు
గౌతు లచ్చన్న.

☆☆☆☆

# లాటరీ వ్యతిరేక ఉద్యమం చేపట్టాలి !

### డైలీ లాటరీల వ్యతిరేక ఉద్యమం చేపట్టాలి!

నేడు జిల్లాలోని పట్టణాల్లో, పల్లెల్లో మహమ్మారి వలె వ్యాపించి పోతున్న డైలీ లాటరీల పై ఒక వ్యతిరేక ఉద్యమం చేపట్టవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. పలువురు ఈ లాటరీల వ్యామోహంలో పడి ఆస్తులు హరింప జేసుకొని ఆర్థికంగా చితికిపోయి ఆత్మహత్యలు చేసుకోవడం మన మందరం చూస్తున్నాం. సారా వ్యతిరేక ఉద్యమం చేపట్టి రాష్ట్రంలోనే ఆదర్శంగా నిలచిన మన జిల్లా మహిళలు, డైలీ లాటరీల వ్యతిరేక ఉద్యమం తప్పనిసరిగా చేపట్టాలి.

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు.

### ద్వంద్వ నీతి తగదు ఆర్టీవో గారు

టౌన్‌లో నారానికో రోజైనా గాంధీబొమ్మ, బోస్ బొమ్మల వద్ద, వి.ఆర్. కాలేజి సెంటర్ వద్దనో రవాణా శాఖాధికారులు క్యాంపులు వేస్తుంటారు. ఆ సమయంలో రోడ్డుపై వెళ్లే ద్విచక్ర వాహనారూఢులను డ్రైవింగ్ లైసెన్సులేదని, హెడ్ లైట్లు వెలగడం లేదని ఇవన్నీ కాకుంటే ఇండికేటర్స్ వెలగడంలేదనో, వెనుక లైట్ ఆరిపోయిందనో కేసులు బుక్ చేస్తారు. ద్విచక్ర వాహనారూఢుల వద్ద నుండి వందల రూపాయల్లో జరిమానా వసూలు చేస్తారు. కాని వీరి కళ్లకు ఆర్టీసీ బస్సులు కనబడవు. చాలా బస్సుల హెడ్ లైట్లకు బ్లాక్ మార్కింగ్ లేని విషయం వీరికి పట్టదు. వెనుక వైపు బ్రేక్‌లైట్స్, ఇండికేటర్స్ అనేవి అంతరాష్ట్ర సర్వీసులకు కూడా లేని విషయం వీరికి తెలియదా? అయితే ఒక్క బస్సు పై కూడా కేసు నమోదు చేసిన సంఘటనే లేదే? ప్రభుత్వ ఆధీనంలో ఉన్న వాటికి ఒక నీతి - ప్రజలకో నీతా? ఈ ద్వంద్వ నీతి తగదు ఆర్టీవో గారు.

-సి. మోహన్‌కృష్ణ

నెల్లూరు.

### రికవరీ పేరుతో వేధించడం తగదు

టౌన్‌లోని లోకల్ ఫండ్ ఆఫీసులోని అధికారుల అర్థం, పర్థంలేని

## జనవాణి

చర్యల వల్ల ఉపాధ్యాయులు ఎంతో వ్యధకు లోనవుతున్నారు. ఇటీవల 10-15 సంవత్సరాల సర్వీసు పే స్కేళ్లలకు సంబంధించి ఆడిట్ రికవరీ చేపట్టారు. ప్రభుత్వ ఉత్తర్వు 130/91 ప్రకారం 1986 సెప్టెంబరు వరకు రికవరీ చేయమని ఉంటే, ఇక్కడి అధికారులు కొందరికి 1978 నుంచి మరి కొందరికి 1982, 1986 నుంచి రాస్తున్నారు. అసలు ఈ రికవరీలు దేనికో ఎవరికీ తెలియదు. 10-15 ఏళ్ల సర్వీసు స్కేళ్లలో 12 నెలల ఇంక్రిమెంటుకు బదులు నార్మల్ ఇంక్రిమెంట్ ఇచ్చారట. కాని 10-15 ఏళ్ల మధ్య సర్వీసు స్కేళ్లకు పునాది జీవో. 164/82 లోనే నార్మల్ ఇంక్రిమెంట్ ప్రస్తావన ఉంది. దీనిపై క్లారిఫికేటరీ జీవో. 1528/84 కూడా ఈ విషయాన్ని సమర్థిస్తూ ఇవ్వబడి వుంది. విచిత్రమేమిటంటే టీచర్ల ఎస్.ఆర్.లు తెప్పించుకొని దగ్గర పెట్టుకొని ఎప్పుడెంత మూల వేతనం తీసుకొని ఉన్నారనే విషయం కూడా చూడక రికవరీ రాస్తున్నారు. 78 నుండి 82 వరకు రికవరీ ఒక్కసారి కట్ట మంటే ఇప్పుడు ఎక్కడ నుంచి తెచ్చి కడతారు. ఒకసారి ఇచ్చి మళ్లీ కట్టమనే ప్రభుత్వ ధోరణి గర్హనీయం. ఈ విషయమై ప్రభుత్వం వెంటనే ఒక నిర్ణయం తీసుకోవాలి.

- బి. వెంకట సుబ్బయ్య

### కుటుంబ నియంత్రణ పారితోషికం పెంచాలి

ప్రస్తుతం కుటుంబనియంత్రణ ఆపరేషన్లు చేయించుకొన్న స్త్రీలకు [illegible] 8 పేజీలో

8 పేజీలో

# తెలుగు సినిమా తీరులో ఫిఫ్త్ టౌన్ పోలీస్ స్టేషన్

నెల్లూరు, దర్గామిట్టలోని ఐదవ నంబరు పోలీసు స్టేషన్ అరాచక నిలయంగా మారిందని గగ్గోలుగా వుంది. తెలుగు సినిమాలలో తరచు కన్పించే స్టేషన్‌లను తలపింప చేస్తున్న దంటున్నారిది. స్టేషన్‌లో రెండు పార్టీలు- ఎస్‌ఐ గారిది ఒక వర్గం, కానిస్టేబిళ్లది మరొక వర్గం. ఒకరినొకరు శత్రువులుగా చూసుకుంటారట. ఎవరి శక్తికి తగినట్లు వారు స్టేషన్ పరిధిలో వ్యభిచార గృహాలను జూదశాలలను నిర్వహిస్తున్నారట. స్టేషన్ అధిపతులవారి రాసలీలలు కథలు కథలుగా విన్పదుతున్నాయి. ఇంకొక ప్రక్క ర్యాదులు ఇవ్వడానికి వచ్చే వారిని పీక్కుని తినడంలో ఫిఫ్త్‌టౌన్ పోలీసు స్టేషన్‌కు ప్రథమ బహుమతి వస్తుందని చెప్తున్నారు. ఫిర్యాది దగ్గరా, ముద్దాయి దగ్గర కూడా ఫీజు దండడంలో వీరు స్పెషలిస్ట్ చేసి వున్నారట.

ఎస్‌పిగారూ - మరీ అలజడిగా వుంది. ; ఒక చూపు చూడండి.

## చిత్రకార్తె

గ్రిద్దలూరు గోపాలరావు

చిత్రకార్తెలో
వానపడినేలంతా
చిత చితగావుండేదంతా
ఈ ఏడు చిత్రకార్తెంతా
చిరలా ఒక్క చినుకైనా
సరసరా సాగిపోయింది
సడీ చప్పుడు లేకుండా
దారిలో అర్ధగించి అడిగా
ఒక్క చినుకైనా రాల్చకుండా
వెక్కియటం న్యాయమా అని
కిరాతక హత్యలు
రాక్షస కృత్యాలు
స్వార్ధపు నియంతృత్వాలు
భయంకరంగా సాగిస్తున్న
సమర భీభత్సంలో
ఎడతెరిపి లేకుండా
కురిసే రక్తవర్షానికి
నేలంతా రక్తసిక్తమై
చిత చిత మంటుంటే
ఆ నెత్తురు చిత్తడి నేలమీద
విలువైన వాన చినుకు రాల్చ
మనస్కరించ లేదు. క్షమించాలి.
చింతాక్రాంతయై చెప్పింది
చిత్రకార్తె.

## సింహపురి

### సుఖాలకై ఆరటమే దుఃఖానికి హేతువు

ధవళేశ్వరం ఆశ్రమ స్థాపకుడు శ్రీ సుందర చైతన్యానంద స్వామి 27తేది సాయంత్రం టౌన్‌హాల్ ఆవరణలో అధ్యాత్మికోపన్యాసం చేశారు. చైతన్యానంద స్వామి వారిది విలక్షణ ప్రచార శైలి. హిందూమతం పట్ల ఆరాధన కల్గిన యువకులను చేరదీసి, వారిని ప్రోత్సాహపరచి సత్సంగాలు ఏర్పరచి, అధ్యాత్మిక భావాల ప్రచారం చేస్తున్నారాయన. ఆయన నెల్లూరు వాసి. వెంకటగిరి విశ్వోదయ కళాశాలలో పాతికేళ్ల క్రితం ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేశారు. ఆ తర్వాత లౌకిక జీవనం వదలి, విరాగియై, దేశమంతా తిరిగి , ధవళేశ్వరంలో ఆశ్రమం స్థాపించారు. మామూలు పాఠకులకు అర్ధమయ్యేటట్లు హైందవ ధర్మప్రచార పుస్తకాలను, భగవద్గీత వంటి

కొరవ 10 పేజిలో

## సణుగుడు

### * స్వామీజీలోనూ స్వాతిశయమా ?

సుందర చైతన్యానంద స్వాముల వారి ఉపన్యాసం విన్నావా?

అద్భుతమైన ప్రసంగం; కోరికలున్నంత కాలం క్లేశాలు తప్పవని మనసుకు హత్తుకునేట్లు ఎంత విడమరచి చెప్పారో!

అంత తెలిసినవారు, ఆ ఉపన్యాసంలోనే తన కోరికలు తీరడం లేదని చింతిల్లినాడేమిటి?

సర్వసంగ పరిత్యాగులైన స్వాముల వారికి కోరిక లేమి వుంటాయి?

తన ఉపన్యాసాల ప్రచారం, తన ప్రబోధాల ప్రభావం మరింత ఎక్కువ మందికి చేరాలని;తన సభలు, గీతాజ్ఞాన యజ్ఞాలు బ్రహ్మాండంగా జరగాలనేది ఆయనకోరిక; అదైనా ఆయన మాటల్లో -క్లేశానికి కారణభూతమే. కదా !ఒకరికి మరింత డబ్బు సంపాదించాలనేది కోరికైతే, ఇంకొకరికి మరింత పెద్ద పదవి సాధించాలనేది కోరిక; మరొక రికి ప్రమోషన్ కావాలని కోరికైతే, ఇంకొకరికి ఇంకొక రకమైన కోరిక. ఎవరి సంస్కార స్థాయిని బట్టి, ఎవరు బ్రతుకుతున్న వాతావరణాన్ని బట్టి, ఎవరు తీర్చిదిద్దుకున్న జీవితాలను బట్టి వారిలో ఆ రకమైన కోరికలు రెపరెప లాడుతుంటాయి. కోరికనేది వుంటే, సుఖం

### డోలేంద్ర

కావాలనే తాపత్రయం వుంటె ప్రక్కనే విడవకుండా దుఃఖం వుంటుందని కదా స్వామి ప్రబోధించేది; మరి ఆయన దుఃఖాన్ని బాపేదెవరు?

అది సరే -సర్వసంగ పరిత్యాగులకు స్వాతిశయం వుండవచ్చా?

స్వాతిశయం పరిత్యజించ కుంటె సర్వసంగ పరిత్యాగం సాధ్యంకాదు;? సిద్ధిపొందడం అసలే దుస్సాధ్యం?

మరి స్వామిజీ, తన ప్రబోధాలకు జనం లక్షలలో వస్తున్నారని, హైదరాబాదులో తానున్నంత కాలం ఆటోఎక్కినా, రైలెక్కినా తానిచ్చిన భగవన్నినాదం మార్మ్రోగిందని తన గీతాజ్ఞానయజ్ఞాలు బ్రహ్మాండం జరుగుతున్నాయని, జనం పట్టడం లేదని, వసతి సౌకర్యాలు అద్భుతంగా ఏర్పాటు చేస్తున్నారని తానే చెప్పుకోవడం సబబుగా వుందా? హైదరాబాదుకు వెళ్తే మనకు కత్తిపోట్లు, అసమ్మతి తూట్లు తప్ప భగవంతుడి పేరెక్కడ విన్పదుతూంది ?

ఎంతటి వారైనా, కొన్నిసార్లు పప్పులోకాలువేయక తప్పదు; తప్పులెన్నడం తప్ప నీకు వేరే పనివుండదు. పెద్దవారిలో లోట్లు వెతకడం పెద్ద తప్పు- చెంపలేసుకో!

# ఐఆర్ 20 కి బదులుగా కొత్త రబీ వరి రకాలు

మన జిల్లాలో దాళ్వా(రబీ)పంట కాలంలో సుమారు మూడు లక్షల ఎకరాల విస్తీర్ణంలో సాగుచేస్తున్నారు. ఇందులో ఎక్కువ భాగం నైరుతీ ఋతుపవనముల ప్రభావము ద్వారా లభించే వర్షాధార చెరువుల క్రింద సాగుచేయ బడుతుంది. మొలగొలుకుల పంట కాలము కన్నా 'రబీ' పంటకాలములో దిగుబడులు ఆశాజనకముగా వున్నప్పటికి, వరి దిగుబడుల స్థాయిని పెంచేందుకు అవకాశముందని పరిశోధనా ఫలితాలు, ప్రదర్శన క్షేత్ర ఫలితాలు తెలియజేస్తున్నాయి. పెరుగుతున్న జనాభాను, రైతు సోదరుల ఆర్థికాభివృద్ధిని దృష్టిలో వుంచుకొని వరి దిగుబడులను గణనీయంగా పెంచవలసిన అవసర ముంది. ఇందుకు ముఖ్యంగా గమనించవలసిన అంశాలు:

* ఆయా పరిస్థితులకు అనువైన వరి రకాలను ఎంపిక చేసుకోవాలి.
* వరికి అవసరమైన పోషక పదార్థాలను సరైన మోతాదులో సకాలములో సరఫరా చేస్తూ తగిన యాజమాన్య పద్ధతులను పాటించాలి.
* సస్యరక్షణ చర్యలను సకాలములో గైకొని వరిపైరును చీడ పీడల బారినుండి కాపాడాలి.

ప్రత్యామ్నాయ రకాల అవసరము ఏర్పడినది.

**డాక్టర్ పి. రాఘవరెడ్డి, ఎంఎస్‌సి (అగ్రి)**

మన జిల్లాలో వివిధ పరిస్థితులకు అనువైన వరి రకాలు-

### మామూలు భూములకు

స్వర్ణముఖి, ఐ.ఆర్-20, ఐ.ఆర్.-64

చిరు ప్రదర్శనలో వున్న రకాలు: యన్.యల్.ఆర్- 33057, యన్.యల్.ఆర్-33079

### చౌడు భూములకు:

కో-43 యన్.యల్.ఆర్.- 33358 దోమపోటు ప్రాంతాలకు: యం.టి.యు 4870

ఈ వరి రకాల లక్షణాలను పరిశీలిస్తాము.

### ఐ.ఆర్.-20

ఈ రకము ఐ.ఆర్-262/టి.కె.యం.6 సంతతికి చెందినది. కాలపరిమితి - అక్టోబరు ముందుగా విత్తితే 135 రోజులు, నవంబరు-డిసెంబరు మాసములలో విత్తితే 120-125 రోజులు గల్గియున్నది. ఆలస్యంగా నాట్లు వేయు ప్రాంతాలకు, చెరువుల క్రింద సాగుచేయుటకు అనువైనది. దిగుబడి ఎకరాకు సుమారు మూడు, మూడున్నర పుట్లు ఇవ్వగలదు. దోమపోటు, అగ్గితెగులు వ్యాధులను ప్రస్తుతం తట్టుకోలేదు. గత దశాబ్దం పైగా రైతు సోదరుల మన్ననలను పొందిన ఈ రకం అగ్గితెగులు దోమపోటులకు గురైనందున

### స్వర్ణముఖి (ఎన్.ఎల్.ఆర్.145) :

ఈ రకము కాలపరిమితి 'రబీ'లో 135రోజులు. మొక్కలు మధ్యస్థ పొడవుతో దృఢంగా వుండి పంటపై పడిపోక వేసిన ఎరువులకు తగిన పంటను ఇవ్వగలదు. గింజ నాణ్యత గల్గి ఎకరాకు మూడున్నర నుంచి నాలుగు

కొరవ 11 పేజిలో

## దక్కిలి బందిపోట్ల ఘాతకానికి ఇద్దరి బలి; జిల్లా చరిత్రలో ఎరుగని ఘోర దురంతం!

# పల్లెలు భయంతో వణికి పోతున్నాయి!

దక్కిలిలో జరిగిన ఘోర బందిపోటు దురంతంతో జిల్లాలోని పల్లెలంతా భయంతో వణికి పోతున్నాయి. ఏ క్షణంలో ఎవరికి ముసిస్తుందోనన్న భీతితో హడలి పోతున్నది గ్రామీణ ప్రజానీకం.

23తేది రాత్రి దక్కిలి మండలం మర్లగుంటలో బందిపోట్లు మృత్యు భేరీలు మ్రోగించారు. వారి కిరాతకత్వానికి ఆ కుగ్రామం రక్తసిక్తమైంది. అర్ధరాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో దోపిడి దొంగలు గ్రామంలోకి ప్రవేశించారు. 18 మంది వున్న ముఠా అది. అందరూ యువకులే. వంటిపైన డ్రాయర్ తప్ప నూలు పోగు లేదు. కొందరి చేతుల్లో నాటు తుపాకులున్నాయి; తక్కినవారు కత్తులు, గొడ్డళ్లు వంటి మారణాయుధాలు చేత పట్టుక వచ్చారు. ముందుగా గ్రామ పొలిమేరల్లోని ఒక టీచర్ ఇంటిపై పడి, అతర్ని నిద్రలేపి, గ్రామస్తుల వివరాలు అడిగి తెలుసుకొన్నారు. గ్రామంలోకి రావడంతోటే తుపాకులు ప్రేల్చారు. రచ్చబండపైన దాదాపు 25 మంది నిద్రపోతుండినారు. కాల్పులకు భయపడి వారు చెల్లా చెదరుగా పరుగెత్తారు. నిద్రమత్తులో వారికి ఎదురు పరుగెత్తిన మహేశ్వరయ్య అనే యువకుడు తూటా తగిలి అక్కడికక్కడే చనిపోయాడు. ఆ తర్వాత వారు కేరింతలు పెడుతూ, విచక్షణా రహితంగా కాల్పులు జరుపుతూ, ఇళ్లలోకి దూరి చేత కందినవన్నీ జవురుకున్నారు. ఈ పాశవిక హింసాకాండలో పదకొండు మందికి తూటాలు తగిలాయి. 40 సవర్ల నగలు, 25 వేల డబ్బు, బియ్యం, నూనె, కోళ్ళు, చిల్లర సామాను వంటివన్నీ మూటలు కట్టుకొని తీసుక వెళ్ళారు. ఈ భీతావహ పరిస్థితిలో, ఇళ్లలోనుంచి పొలాలవైపు పరుగులు పెట్టిన స్త్రీలను, పిల్లలను సైతం వదలిపెట్టలేదు. [illegible] రిపై కూడా తుపాకి ఎక్కుపెట్టి [illegible] క్రిందపడిన వారి మెడలోని బంగారు నగలు, చెవికమ్మలు కూడా దౌర్జన్యంగా లాక్కున్నారు. దాదాపు ఒకటిన్నర గంట సేపు బందిపోట్లు గ్రామంలో అల్లకల్లోలం సృష్టించారు. నెత్తుటి ఏర్లు పారించారు.

ఒక్క మర్లగుంట గ్రామంలోనే కాదు - జిల్లాలో మనకు తెలిసి ఇంతటి క్రూరత్వం, కిరాతకత్వంతో జరిగిన బందిపోటు సంఘటన మరొకటి లేదు. వెంకటగిరి ప్రాంతంలోనే గత సంవత్సరం బందిపోట్లు తుపాకి పేల్చారు కాని, అది దోపిడిని ప్రతి ఘటించిన వారిని అడ్డుతొలగించుకోవడానికి చేసిన దుష్కృత్యం. కాని ఈ దుర్మార్గులు ఎదురు పడిన వారందరినీ విచక్షణా రహితంగా, విచ్చలవిడిగా కాల్చారు. రక్తం త్రాగే రాక్షసులవలె ప్రవర్తించారు. వీరి రక్తదాహానికి బలైన మహేశ్వరయ్య మరదలు, ఆ ఘోరం విని తట్టుకోలేక ఉరిపోసుకొని చనిపోయిందట. వారికి త్వరలో వివాహం కావలసి వుండింది.

ఈ సంఘటన తర్వాత నెల్లూరు పోలీసులు అప్రమత్తం కావడంతో బందిపోట్లు అడవుల మీదుగా కడప జిల్లాకు వెళ్లి ఇద్దర్ని చంపి, 18 మందిని గాయపర్చారు. ఒక గ్రామాన్ని దోచుకున్నారు. ఒక పసిపాప కూడా వీరి ఘాతుకానికి కన్నుమూసింది.

నెల్లూరు పోలీసులు గట్టి ప్రయత్నమే చేస్తున్నారు. రాత్రీ పగలు కాగడాలు వేసి వెతుకుతున్నారు. కాని ఆ రాక్షసుల ఆచూకీ లభించడం లేదు. ఎస్పి గారు కన్పిస్తే కాల్చివేత ఉత్తర్వు కూడా జారీ చేశారు. రాపూరు, వెంకటగిరి గ్రామాలలో యువకులు జట్లు జట్లుగా పహరా కాస్తున్నారు. జిల్లా అంతా భయం గుప్పిటలో వుంది. ఆ దుర్మార్గులు ఏ దారిలో వచ్చి, ఎవర్ని హతమారుస్తారో తెలియని భయానక పరిస్థితి నెలకొని వుంది.

ఈ ముఠాయే కాకుండా, ఇతరత్రా మరికొన్ని ముఠాలు కూడా జిల్లాలో దోపిడీలు చేస్తున్నాయి. 20 తేది నెల్లూరు టౌన్‌లో, లాయర్ సంపాదకుడు తుంగా రాజగోపాలరెడ్డి ఇళ్లలో జరిగిన దోపిడి తెలిసిందే!27 తేది రాత్రి బాలాజీ నగర్‌లోనూ, దోపిడీ జరిగింది.

పోలీసులు మరింత చురుకుగా, నేర్పుగా పనిచేసి, ఈ దోపిడీ ముఠాలను పట్టుకోగల్గితే గ్రామాలలోని పౌరులు కంటినిండా నిద్ర పోగల్గుతారు.

## జిల్లా వార్తలు

### డాక్టర్‌ను బదలీ చేయకండి

బుచ్చి ప్రభుత్వ హోమియో ఆసుపత్రిలో తన విధులను సక్రమంగా నిర్వహిస్తున్న డాక్టర్ లక్ష్మి నారాయణను బదలీ చేయకూడదని స్థానిక ప్రజలు కోరుతున్నారు. ఈ డాక్టర్ ఈ సంవత్సరం జనవరిలో ఛార్జి తీసుకొన్నప్పుడు కేవలం రోజుకు నాలుగైదు మంది పేషంట్లు వచ్చేవారట. ఇప్పుడు వారి సంఖ్య వంద దాటుందని చెబుతున్నారు. డాక్టర్ పై ప్రజాభిమానం పెరగడం చూసి ఓర్వలేక కొన్ని ప్రగతి నిరోధ శక్తులు ఆయన ట్రాన్స్‌ఫర్ చేయించను ప్రయత్నిస్తున్నారని వీరు వాపోతున్నారు. మంచి హస్తవాసికలవారిపై కక్ష బూనడం తగదు సుమా!

### బస్సు ప్రమాదంలో 27మందికి గాయాలు

రాపూరు-చిట్వేలి మధ్యనున్న ఘాట్ రోడ్డులో 23తేది ఆర్టీసి బస్సు లోయలో పడి 27మంది ప్రయాణీకులు గాయపడ్డారు. రాపూరు డిపోకు చెందిన ఈ బస్సు రాజం పేటనుండి వస్తుండగా ఈ ప్రమాదం జరిగింది. బస్సు స్టీరింగ్ ఎండ్ విరిగిపోవడంవల్ల కొండ మలుపు

# నెల్లూరు వచ్చేవెళ్ళే

## విహార్యకుడు

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి ఈ రోజు(30తేది) వెంకటగిరి వచ్చారు. సాయంత్రం వరకు అక్కడే పలు కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

31 తేది ఉదయం వాకాడులో ఐటిఐ భవన శంకుస్థాపన; 3గంటలకు బయల్దేరి నెల్లూరు వస్తారు. సాయంత్రం 5 గంటలకు జమీన్‌రైతు భవన ప్రారంభోత్సవం; 6 గంటలకు ఇందిరాభవన్‌లో ఇందిరాగాంధి వర్ధంతి సంస్మరణ సభ; రాత్రికి వాకాడు.

1 తేది కూడా వాకాడులోనే వుండి, 2తేది ఉదయం తిరుపతి మీదుగా హైదరాబాదు వెళ్తారు.

### పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య నెల్లూరు జిల్లా తొలి పర్యటన ఈరోజు ప్రారంభమైంది. 30 తేది ఉదయం వెంకటగిరి వచ్చారు. రేపు(31తేది) జనార్దనరెడ్డితోనే వుంటారు. 1 తేది సూళ్ళూరుపేట, 2తేది నాయుడుపేట, 3తేది తద ప్రాంతాలలో పర్యటిస్తారు; 4 తేది నెల్లూరు వచ్చి

మునిసిపల్ అనుమతి లేదని. వాటిలో ఇళ్లు కడితే నష్టపోతామని హెచ్చరించారు. కంపెనీల పేర్లు కూడా వ్రాశారు.

అధికారులతో సమావేశం జరిపి, రాత్రి చార్మినార్ ఎక్స్‌ప్రెస్ ఎక్కుతారు.

### మంత్రులు

వెంకటగిరి కార్యక్రమాలలో పాల్గొనడానికి ఐదుగురు మంత్రులూ సమాచార మంత్రి శ్రీపసల పెంచలయ్య, రోడ్ల మంత్రి శ్రీ దివాకర రెడ్డి, విద్యామంత్రి శ్రీపి.రాజం, పంచాయితీల మంత్రి శ్రీ డి.కె. సమర సింహారెడ్డి, కార్మిక మంత్రి శ్రీ పి. జనార్దనరెడ్డి నెల్లూరు వచ్చారు. అందరూ రాత్రి 8 గంటలకు మద్రాసు బయల్దేరి వెళ్లారు.

### రియల్ ఎస్టేట్‌లపై మునిసిపాలిటీ హెచ్చరిక

నెల్లూరు టౌన్‌లో తామర తంపరగా వస్తున్న రియల్ ఎస్టేట్ల విషయంలో జాగ్రత్తగా వుండమని హెచ్చరిస్తూ మునిసిపల్ కమీషనర్ శ్రీ జి.రామనారాయణ రెడ్డి ఒక పత్రికా ప్రకటన చేశారు. ఈ కంపెనీలు అమ్మేస్థలాలకు

నది టౌన్‌లో ప్లాన్లు లేకుండా కట్టే భవనాలను కళ్లు మూసుకొని చూసే మునిసిపాలిటీకి, ఆరేడు మైళ్ల దూరంలో అమ్మే ఇళ్ల స్థలాలపై ఎందుకు కన్నుపడిందట్నా?

### నిప్పోలో అమెరికా రాయబారి

నెల్లూరు నిప్పో ఫ్యాక్టరీని అమెరికా రాయబారి శ్రీ థామస్ ఆర్ పికరింగ్ సందర్శించారు. 28 తేది మధ్యాహ్నం హైదరాబాదు నుంచి మద్రాసుకు రోడ్డు మార్గంలో వెళ్తూ, ఇక్కడ ఆగారాయన. ఆంధ్రలో పరిశ్రమల అభివృద్ధిని స్వయంగా చూడాలనే ఉద్దేశ్యంతో ఓపికగా ఇంత దూరం కారులో ప్రయాణంచేశారు. దారిలో గుంటూరులో ఐటిసి కర్మాగారం చూశారు.

నిప్పో అధినేత శ్రీ ఓబులరెడ్డి అమెరికా రాయబారికి ఫ్యాక్టరీ ముఖద్వారం దగ్గర హార్దికంగా స్వాగతం పల్కారు. ఫ్యాక్టరీ పనితీరును వివరంగా చూపారు. కమ్మటి విందు కూడా ఇచ్చారు. ఓబులరెడ్డిగారు తన నిప్పోను తాను చూసి ఎప్పిరోజాత్రింటో- రాయబారి పుణ్యమా అని తానూ ఫ్యాక్టరీ విజిట్ చేయగల్గారు. మద్రాసు సమీపంలో అమెరికన్ల సాంకేతిక సహకారంతో తాను నెలకొల్పబోతున్న 50 కోట్ల విద్యుత్ బల్బుల ప్రాజెక్ట్ గురించి రాయబారికి వివరించారు శ్రీ ఓబుల రెడ్డి.



28 తేది నెల్లూరులో అమెరికన్ రాయబారి థామస్ ఆర్‌పికరింగ్‌కు తమ ఫ్యాక్టరీ చూపుతున్న నిప్పో అధినేత పి. ఓబుల రెడ్డి

### సారాయి ఉద్యమం

జిల్లాలో సారాయి ఉద్యమం చప్పబడిపోయింది; దినదినానికీ నీరు గారిపోతున్నది. ఈ మాటంటే ఉద్యమ కారులకు బాధ కలుగవచ్చు. కోపం రావచ్చు; కాని వాస్తవం మాత్రం అదే. ఉద్యమం గ్రామాలను వీడి, టౌన్‌లోని సారావేలం పాటల కేంద్రానికి, ఊరేగింపులకు చేరినప్పుడే సగం నీరసపడింది; ఎన్టీఆర్ రంగప్రవేశం చేసి కొరవా సరవా నీళ్లు చల్లాడు.

గ్రామాలలో త్రాగుడు యథాప్రకారం మొదలై పోయింది. ఉద్యమం మహా ఉధృతంగా సాగిన పల్లెలలోనూ కావుడు సారా సంచులు దర్శన మిస్తున్నాయి. కర్నూలు, చిత్తూరు, కడప, ఒంగోలుల నుంచి సర్కారు సారా, నాటుసారాల స్మగ్లింగ్ నిరంతరాయంగా జరిగిపోతూంది. బస్సులలో, కార్లలో, లారీలలో, రైళ్లలో ఎటు సందు చిక్కితే ఆ మార్గంలో సారా తరలిస్తున్నారు. ఎక్సైజ్, రెవిన్యూ, పోలీసు అధికారులు దాడులు జరుపుతున్నప్పటికీ, పట్టుబడుతున్న పరిమాణం పదిశాతం కూడా వుండదని అంచనా. పొదలకూరు, ఆత్మకూరు, రాపూరు, వెంకటగిరి, సూళ్లూరుపేట ప్రాంతాలలో కావుడు సారా వ్యాపారం దివ్యంగా సాగిపోతూంది. అప్పుడప్పుడు, అక్కడక్కడా ఉద్యమ కార్యకర్తలు సారా పొట్లాలు కనిపెట్టి, తగలబెడుతున్నా, ప్రక్కక్షణంలో మళ్లీ ప్రత్యక్షమౌతున్నాయి. ఉద్యమం పటిష్టంగా వుంటే స్మగ్లింగ్ జరిగేది కాదు. కాని, అది నీరసపడడంతో ఇది విజృంభిస్తున్నది.

ఈ పరిస్థితులలో ప్రొహిబిషన్ ప్రకటిస్తే కావుడు సారా ఇంకెంత మితిమీరి పోతుందోనని భయపడిపోతున్నారు. సర్కారు సారా డిపోల నుంచి సైతం అమ్మకాలు ఏమాత్రం తగ్గడంలేదు.

ఉద్యమ నిర్వాహకులు ఈ పరిస్థితులను అంచనా వేసుకొని, తమ కార్యక్రమాలను పునఃపరిశీలించుకోవడం అవసరం. వేలం పాటల వాయిదాతోనే సంబరపడి, సర్దుకపోతే ఇంత పెద్ద ఉద్యమం నిర్మించి చేజేతులా పాడుచేసిన వారౌతారు.

రాత్రికి రాత్రి జిల్లానుంచి నూటికి నూరుశాతం త్రాగుడు నిర్మూలించాలనుకోవడమే ఉద్యమ కారులు చేస్తున్న పెద్ద తప్పిదం. ఏ మనిషీ తన బలహీనతలను ఒక్క రోజులో వదులుకోలేడు. ఈ వ్యసనం నిర్మూలనకు అది మార్గం కానేకాదు. నిర్బంధాల వల్ల, అడ్డదారిలో వ్యసనాలు తర్చుకోవడానికి ప్రయత్నిస్తారే తప్ప, మానుకోలేరు. దానికి సాంఘిక చైతన్యం కావాలి. మొదట్లో ఈ ఉద్యమం నడిచింది. ఆ తీరులోనే. ఇప్పుడు పద్ధతే మారిపోయింది. మహిళలను చైతన్య పరచి, సంఘటితం చేసే కృషిని విస్మరిస్తున్నారు. ఉద్యమంలో మహిళల పాత్ర క్రమక్రమంగా క్షీణిస్తున్నది. మహిళలు దూరమైన మరుక్షణం ఉద్యమం మాయమౌతుందన్న వాస్తవం ఎవరూ పట్టించుకోవడం లేదు.

ఏ ప్రేరణతోనే, జిల్లా వాసులు గర్వపడగల్గిన ఒక మహోత్కృష్ట ఉద్యమం ఈ జిల్లాలో ఊపిరి పోసుకున్నది; అది ఇంతలోనే నిర్వీర్యం కావడం, కావుడు సారా స్మగ్లర్లను కోటీశ్వరులను చేసేందుకు మాత్రమే ఉపయోగ పడడం విచారకరం!



### కాంగ్రెస్ కార్యవర్గంలో నెల్లూరు వాటా!

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మర్రి తులసి దాస్ ఏడాది కాలం పాటు హైదరాబాదు ఢిల్లీల మధ్య ఆసుబోసి, సాము చేసి, ఎట్టకేలకు కష్టపడి కార్యవర్గాన్ని ప్రకటించారు.

మొత్తం నలభైలో పదవ వంతు వాటా నెల్లూరు జిల్లాకు లభించింది. కీలకమైన కోశాధికారి పదవి శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డికి; ఉపాధ్యక్షులలో ఒకటి శ్రీ తిక్కవరపు సుబ్బరామరెడ్డికి; ప్రధాన కార్యదర్శుల్లో ఒకటి ఏ. ప్రకాశరావుకు; కార్యవర్గ సభ్యత్వాలలో ఒకటి కుమారి కుడుముల పద్మశ్రీకి.

కార్యవర్గంలోకి తీసుకోబడిన నలుగురూ, వేరే పదవులున్న వారు. ఇద్దరు ఎంపిలు, కార్పొరేషన్ చైర్మన్‌గా వున్న ఒక శాసన సభ్యుడు, టి.టి.డి చైర్మన్ ఒకరు. పదవి లేని అనుభవజ్ఞుడైన పాత కాంగ్రెస్ వాది ఎవ్వరూ దుర్భిణీ వేసి వెతికినా దొరకలేదు. పాపం దాస్ గారికి!

మన జిల్లా సంగతి అది. అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వుండడం మర్రి వారి కార్యవర్గంలోని విశేషం. మరో ప్రత్యేకత ఢిల్లీ పీఠాధిపతి కుమారుడికి పుల్లలు పెట్టడానికి వుపయోగపడే ఒక సమీప బంధువుకి స్థానం కల్పించడం. బంధు ప్రీతి, ఆశ్రిత పక్షపాతం వంటి అవలక్షణాలు కలిగిన వారు నాయకులు కాలేరు, మరొకరికి నీతులు చెప్పలేరు!

కొరవ 7 పేజిలో



బొంబాయి రిజర్వు బ్యాంకు ఉద్యోగి కె. శ్రీనివాసులు కుమార్తె సత్యజ్యోతిర్మయి. భానుప్రసాద్ వీరి వివాహం ఇటీవల నెల్లూరులో జరిగింది.

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

### వీరారెడ్డి సత్రం - పరాధీనానికి వ్యతిరేకత

మద్రాసులో నెల్లూరు నుండి పోయే రోగార్తుల పాలిట దైవంగా వుండిన నిస్వార్థ సేవాజీవి స్వర్గీయ వాకాటి వీరారెడ్డి పేరుతో వలశై ఏళ్ల నాడువిశాలమైన ప్రాంగణంతో పాత భవనం సత్రానికి కొనబడింది. కొనుగోలు సత్రానికి వీరారెడ్డి గారు కూడా స్వయంగా జిల్లాలో విరాళాలు ప్రోగు చేశారు. సత్రం పాలకవర్గం ఏర్పడింది. దాని మొదటి అధ్యక్షుడు కీ.శే. డాక్టర్ గురుస్వామి మొదలియారు. తర్వాత అధ్యక్షుడైన స్వర్గీయ ఆర్. ఎల్. రెడ్డి గారు తనకెందుకొచ్చిన శ్రమ అనుకున్నారో ఏమో, నెల్లూరు నుండి పోయే రోగులకు ఎంతో వుపయోగకరంగా వుండిన ఆ సత్రాన్ని తిరుపతి దేవస్థానం వారికి శాశ్వతంగా ధారాదత్తం చేశారు. నెల్లూరు రోగుల సౌకర్యం కోసం వుద్దేశించిన ఆసత్రం ఇప్పుడు తిరుపతి దేవస్థానం వారి రహదారి బంగళాగా మారి పోయింది. వీరారెడ్డి గారి వుద్దేశ్యానికి, సత్రం ఏర్పాటు చేయడానికి పూర్తి విరుద్ధమైన చర్య ఇది.

సత్రం బదలీకి జిల్లాలో తీవ్రమైన వ్యతిరేకత వుంది - మొన్న 22 తేది పాత ట్రస్టు బోర్డులో సజీవంగా వున్న ఏకైక సభ్యులు శ్రీ దువ్వూరు జానకిరాం రెడ్డి అధ్యక్షతన జరిగిన సమావేశంలో సత్రాన్ని టి.టి.డి. వారి చెర నుండి విడిపించే ఆందోళనకు, చర్యలకు శ్రీ గునుపాటి ఆదిశేషారెడ్డి గౌరవాధ్యక్షుడుగా వి.సి.రెడ్డి అధ్యక్షుడుగా ఒక కమిటీ ఏర్పడింది.

వీరి లక్ష్యంకు ఎరవ సమర్థనీయం, ప్రశంసనీయం. ఇటువంటి కమిటీలకు రాజకీయ రంగు అంటుకుంటే అసలు కార్యమే భంగమై పోతుంది. అది చేసి అది రానివ్వకండి!

### జయంతి సభలు

వర్తమాన సమాజార్వర్యంలో కవికోకిల దువ్వూరు రామిరెడ్డి జయంతి సభ- 9 తేది., శ్రీ కృష్ణదేవరాయ జయంతి సభ 10 తేది- సాయంత్రం 6.30 గంటలకు టౌన్‌హాల్‌లో జరుగుతాయి. రామిరెడ్డి జయంతి సభలో శ్రీ వివి రమణారెడ్డి , శ్రీ ఇలపావులూరు కామేశ్వరరావుగారిని; కృష్ణరాయసభలో శ్రీ చల్లగుండ్ల రామచంద్రయ్య- శ్రీ ఏలూరు పాటి అనంతరామయ్యను సత్కరిస్తారు.

### అన్సారి జీవిత కథ

నెల్లూరు ముస్లిం ప్రముఖుడుగా, గౌరవనీయుడైన సింహపురి పౌరుడుగా, నెల్లూరు బార్ అసోసియేషన్ సభ్యుడుగా, హిందూ ముస్లిం ఘర్షణల్లో సామరస్యానికి కృషి చేసిన ఆదర్శవంతుడుగా, పబ్లిక్ ప్రాసిక్యూటరుగా, రోటేరియన్‌గా, హై కోర్టు ప్రధాన న్యాయమూర్తిగా, మైనారిటీస్ కమీషన్ ఛైర్మన్‌గా వివిధ రంగాలలో వున్నత స్థానాలలంకరించి దివంగతుడైన ఎం.ఎ. అన్సారి గారి జీవిత కథనం వ్రాయాలని ఆయన కుమార్తె సంకల్పించింది. తన తండ్రి జీవితాన్ని తమ కుటుంబీకులకు, బంధుమిత్రులకు తెలియజేయడానికి నన్నది ఆమె. అన్సారి చదువు నెల్లూరులో ఎస్.ఎస్.ఎల్.సి వరకే సాగింది. ఇంటరు, డిగ్రీ, లా అన్నీ మద్రాసే. ఆయన జీవితంలోని విశేషాలను గూర్చి, ఆయన విశిష్ట వ్యక్తిత్వాన్ని గూర్చి, ముఖ్యంగావిద్యార్థిగా ఆయన ఎట్లా వుండే వాడు అనే దాన్ని గూర్చి ఆయన సహపాఠులు, సహచరులు, మిత్రులు తమ జ్ఞాపకాలను వ్రాయగలిగితే తన కృషికి ఎంతోసహాయంగా వుంటుందని ఆమె కోరుతున్నారు. ఎవరైనా తాము వ్రాసేది జమీన్‌రైతు కార్యాలయానికి పంపితే ఆమెకు చేర్చగలము.

దివంగతుడైన తన తండ్రి పట్ల ఇంతటి ప్రేమాభిమానాలు గల ఆయన కుమార్తె కలకత్తాలో కాలేజి లెక్చరరుగా వుంటున్నది; డాక్టరేట్ కోసం ఏదో విషయం మీద పరిశోధన జరుపుతున్నది. అభినందనీయమైన విషయం ఆమె కలకత్తా ఆంధ్ర అసోసియేషన్ అధ్యక్షురాలట. తెలుగు చక్కగా మాట్లాడుతున్నది- అన్సారి గారు కూడా అంత బాగా మాట్లాడ గలిగే వారు కాదు.

### మరణాలు

స్వాతంత్ర్యయోధుడు, పచ్చి కాంగ్రెస్ వాది, చేతి మందం ఖద్దరు ధరించే నిజమైన గాంధేయుడు, బ్రాహ్మణక్రాక వాసి శ్రీ వంకేరు వరదారెడ్డి 10 తేది కాల ధర్మం చెందారు. ఆయన వయస్సు 77 సంవత్సరాలు. ఆయనకు ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు వున్నారు.

వరదారెడ్డి గారు చాలా కాలంగా అస్వస్థులుగా, చూపు కూడా లేక వుంటున్నారు. మంచి వాడు, ఒక పాత తరం కాంగ్రెస్ వారు పోయారు. ఆయన మరణానికి చింతిస్తూ, వారి కుటుంబానికి ఆలస్యంగా మా సంతాపం తెలియజేస్తున్నాము.

లవకుశ శంకరరెడ్డి సోదరుడు, కాంగ్రెస్ వాది, నాయుడుపాళెం పెద్దరైతు శ్రీ అల్లారెడ్డి సుందరరామరెడ్డి 22 తేది ఉదయం మరణించారు. ఆయన వయస్సు 84 సంవత్సరాలు. స్వగ్రామంలో రామాలయం నిర్మించి, 52 సంవత్సరాలపాటు నిరాటంకంగా, ప్రతి ఏటా శ్రీరామనవమి జరిపిన పుణ్యజీవి, రామభక్తుడు శ్రీ. సుందరరామరెడ్డి.

ఆయనకు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. ఇటీవలే ఎలక్ట్రిసిటీ బోర్డు చీఫ్ ఇంజనీరుగా రిటైరైన శ్రీ ఎవిరాఘవరెడ్డి ఆయన పెద్ద కుమారుడు ; మిగతా ఇద్దరు కుమారులు -జగన్మోహన రెడ్డి, రఘురామరెడ్డి సినీ నిర్మాతలు

వారి కుటుంబానికి మా సానుభూతి.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 17.2అ |
| సర్వేపల్లి | 3.7 అ |
| నెల్లూరు చెరువు | 12.0అ |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | | |
| | 9672 | 3700/- |
| | 9674 | 4100/- |
| | ఐ.ఆర్. 20 | 2900/- |
| సున్నాలు | | 2900/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | | 530/- |
| బంగారు సవర 8 గ్రా | | 3080/- |
| వెండి 10 గ్రా | | 72/- |

### అన్నగారు

(2 పేజీ కొరవ)

ఉత్సాహాన్ని రేకెత్తించ లేదు. వీరి నిరాసక్తతకు అధిష్టాన వర్గం అయోమయం కలిగలవడంతో మరీ అధ్వాన్న మైపోతూంది పరిస్థితి. ఏడాది నుంచి జిల్లా కమిటీని నియమించలేక పోతున్నారు. కనీసం అడ్ హాక్ పద్ధతిలో కూడా ఒక కన్వీనర్‌ను ఎంపిక చేసుకోలేక పోతున్నారు. పార్టీ సభ్యత్వాలు , ఎన్నికలు, పరిశీలకులు వగైరాలన్నీ అధికారంతోటే అదృశ్యమైనాయి. కనీసం గ్రామ కమిటీకి ఎన్నిక జరిపే శక్తి కూడా లేదు. ఇక జిల్లా ఎన్నికలెట్లా నిర్వహిస్తారు?

విచిత్రమైన పరిస్థితి ఏమిటంటే - కన్వీనర్ పదవి ఇస్తాము రమ్మంటే పెద్ద తలకాయలన్నీ మా కొద్దంటే మాకు వద్దు దండం పెట్టి తిరిగి వచ్చేస్తున్నారట. కన్వీనర్ గిరిని అంగీకరిస్తే వారానికి ఒకసారి గండిపేటకు రమ్మని హుకుం జారీ చేసి, చేతి చిలుము వదిలిస్తారన్నది పెద్దభయం; పార్టీ పెద్దరికం కాగితంపై తప్ప, జిల్లా పార్టీలోని ఏ పెద్దలూ అంగీకరించరనేది రెండవ జరుపు;

ఎన్టీఆర్ పర్యటన , అందులో వెల్లివిరిసిన జనం ప్రతి స్పందన దేశం నాయకులలో ఉత్సాహాన్ని ప్రేరేపించి వుండవలసింది. కాని, అది జరగలేదు; అనాథ స్థితి మారలేదు.

ఇప్పుడు, జిల్లా కన్వీనర్ పదవి కోసం శ్రీ బెజవాడ ఓబులరెడ్డి గారు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారట. ఎప్పుడూ సేవ చేయడం తప్ప, సేవలందుకోవడం ఎరుగనివారు ఓబులరెడ్డి. పాపిరెడ్డి గారు ఒక వెలుగు వెలిగినప్పుడు కూడా ఎన్నికల ప్రచారానికి కటౌట్లు కట్టడం, విందుల్లో సీసాలు సర్దడం తప్ప స్వయంగా ఏ పదవీ సంపాదించలేక పోయాడు. ఎన్నికల్లో నిలబడి సాధించడానికి పంచాయితీ సగుంచ్ పదవి సైతం అందని పుల్లని పండే! అడ్‌హాక్ నియామకంతోనైనా ఆయన ఉబలాటం తీరుతుందేమో చూడాలి!

అయితే బుచ్చి దాటలేని నాయకుడికి జిల్లా పెత్తనం అప్పచెప్పడం జరిగితే ఆ పార్టీ పరిస్థితి ఏమిటంటారా? మనకెందుక[illegible]!

### సుడిగుండం

(మొదటి పేజీ కొరవ)

మన రాష్ట్రం వరకు ఈ ఉద్యమాన్ని రాజకీయంగా ఎదుర్కొనడానికి ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి కూడా సిద్ధపడుతున్నారు. 5 తేది జరుగనున్న బహిరంగ సభలో ఆయన ప్రొహిబిషన్ ప్రకటన చేయవచ్చు . ప్రొహిబిషన్ ఎటూ అమలు చేయడం అసాధ్యం కాబట్టి, ఆ నింద ప్రభుత్వంపై పడకుండా, దాని అమలు బాధ్యతను ఉద్యమం పేరుతో ఊరేగుతున్న ప్రతిపక్ష నాయకులకు అప్పచెప్పే పథకం కూడా ప్రకటించ వచ్చునని చెప్తున్నారు. ఎట్టి పరిస్థితుల లోనూ ఎన్టీఆర్‌తో సహా , ఏ నాయకుడూ, ఏ పార్టీ ఆ బాధ్యత స్వీకరించదు. ఆ నిరాకరణ వారి ఉద్యమ ప్రచారానికి నైతికంగా పెద్ద దెబ్బ అవుతుంది.

మొత్తం మీద సారా ఉద్యమం ఒక పెద్ద రాజకీయ సుడిగుండంగా మారనున్నది. ఇందులో మునిగేవారెవరో, తేలేవారెవరో కాలమే చెప్పాలి.









### గుడివాడ సబ్‌కోర్టులో

OS57/1984 EP 39/1990

కొడాలి జయలక్ష్మి DHR

దండమూడి రంగారావు వగైరా JDRs

ఈ నెంబరులో షెడ్యూలు దాఖలా JDR తాలూకు స్వాధీన హక్కు భుక్తములు గలటిన్ని జప్తులు కాబడి వేలంకావలసినటిన్ని 2.11.92తేది కి వేలం వాయిదా అయివున్నది. కాన పాటదార్లు వచ్చి వేలం నాడు ఉదయం 10 గంటలుక హాజరై వేలం పాట పాడుకొనేది.

#### షెడ్యూలు

1. కృష్ణా జిల్లా పామర్రు సబ్‌రిజిస్ట్రారు వారి ఇలాకా పెనుమత్స గ్రామంలోని JDR తాలూకు హక్కు భుక్త స్వాధీనములు గలట్టిన్ని ఈ డిక్రీ బాకీ క్రింద వేలం కావల్సిన స్థిరాస్తి వివరం ASS No. 192 యం. 0.30 సెంట్లు గల్గిన పెంకుల ఇంటి నెం. 194/1, రు. గల్గిన పెంకుటి భవంతికి హద్దులు:

తూర్పు: జాయింట్ బజారు; దక్షిణం: దండమూడి సత్యనారాయణ; పడమర: మాధుగు అప్పారావు; ఉత్తరం: దండమూడి వీరరాఘవయ్య కొంత వరకు, దండమూడి బలరామకృష్ణ కొంత వరకు, పండలనేని రామయ్య కొంత వరకు; ఈ హద్దుల మధ్య యు 0.30 లు ఇంటితో సహా పెంకుటి ఇల్లులో గల్గిన దర్వాజాలు, తలుపులు, కిటికీలతో సహా.

| | |
|---|---|
| DHr Value | Rs. 10,000/- |
| Amina Value | Rs. 12,500/- |

అన్యాక్రాంతములు లేవు.

2) కృష్ణాజిల్లా పామర్రు సబ్ రిజిస్టేషన్ ఇలాకా కృష్ణాపురం గ్రామంలోని JDr కు సర్వ సంపూర్ణ హక్కు భుక్తముల గల ఈ డిక్రీ బాకీ క్రింద వేలము కావలసిన స్థిరాస్తి వివరం:

రి సర్వేనెం. 341/1 లో యు. 0.10 ట్లు

రి సర్వే నెం. 341/2 లో యు. 0.10 ట్లు

రి సర్వే నెం. 341/3 లో యు. 1.13 ట్లు

యు. 1.33 ట్లు లేక 0.539 హెక్టార్ల పల్లం భూమికి హద్దులు:

తూర్పు: పంటబోదె లోని కాలువ; దక్షిణం: పండలనేని వెంకట్రామయ్య గారి భూమి; పడమర: పంట బోదె కాలువ; ఉత్తరము: పంట బోదె కాలువ. ఈ హద్దుల మధ్య వున్న యు. 1.33 సెంట్లులేక 0.539 హెక్టార్ల పల్లంభూమి.

| | |
|---|---|
| DHr Value | Rs. 50,000/- |
| Amina Value | Rs. 55,000/- |

వి.వి. శివరామ్
అడ్వొకేటు

# శివారెడ్డి పద్యాలు

## దీపావళి

ఏపూర్వ జన్మ సుకృతమో
దీపావళి నిన్ను జాస్తి, యాపై వచ్చే
దీపావళి కీడుందదు
పాపము పండింది, కవితో వస్తాయింకా

ఎంత మంది మంత్రులు లెందరెమ్మెల్యేలు
ఎన్నిగోపురాలు ఎన్నిగుళ్లు
ఎన్నిసినిమాలు యేనెల్లలొయ్యేది
ఆంధ్ర విన్నవిది అమరపురికి!

## కోడి కుర్మ

ఎందుకమ్మా!తెయిలి యిగ్గు తబ్బులు
ఇచ్చ.
కంది పులుసు జాలు కాకపోత,
వదలు, కోడికుర్మ వారానికొక పూట
అంతవరకు జాలు!అది వదేలు!

## ఎవరి తప్పు

భర్తతప్పుజేస్తె భగవంతుదిది తప్పు.
భార్యతప్పుజేస్తె భర్తతప్పు.
ప్రజలు తప్పుజేస్తె పరిపాలకులతప్పు
కవులు తప్పుజేస్తె కలము తప్పు

## జిల్లా వార్తలు

5 పేజి కొరవ

వద్ద సుమారు నూరు అడుగుల లోతు ఉన్న లోయలోకి బస్సు జారిపోయింది. అదృష్టవశాత్తు లోయలో దట్టంగా చెట్లు ఉన్నందున బస్సును ఆపేయ గలిగాయి కాని లేకుంటే పలువురు ప్రాణాలు కోల్పోయేవారు. బస్సు లోయలోకి పడగానే పలువురు స్పృహతప్పి పడిపోయారు. కొద్ది సేపటికి తేరుకున్న కొంతమంది మిగిలిన వారిని రోడ్డుపైకి చేర్చారు. తీవ్రంగా గాయపడిన 12మందిని రాపూరు నుండి నెల్లూరు ప్రభుత్వ ఆసుపత్రికి తరలించారు. గాయపడిన 27మందికి 9,500 రూపాయల ఎక్స్‌గ్రేషియాను ఆర్డీసి అధికారులు అప్పటికప్పుడే అందచేశారు. ప్రమాద విషయం తెలియగానే గూడూరు డి.ఎస్.పి. రామకృష్ణారావు, అసిస్టెంట్ కలెక్టర్ శ్రీ అజయ్‌జైన్, ఆర్డీవో సత్యప్రసాద్, ఆర్టీసి డివిజనల్ మేనేజర్ నాగేంద్ర ప్రసాద్ ప్రమాద స్థలాన్ని సందర్శించారు. ప్రమాదం జరిగిన సమయంలో బస్సులో 33మంది ప్రయాణికులు ఉన్నట్లు తెలిసింది. ప్రమాదం జరిగిన తర్వాత రాపూరు ప్రభుత్వ ఆసుపత్రికి గాయపడిన వారిని తరలించగా అక్కడ ఉన్న ఒకే ఒక మహిళా డాక్టర్ వారికి వైద్యం చేయను తీవ్రంగా కష్ట పడవలసి వచ్చింది. ఇంతకు ముందు ఇక్కడ ఉండిన మగ డాక్టర్‌ను 5నెలల క్రితం బదలీ చేయడంతో ఆ పోస్టు ఖాళీగా వుంది.

### లేబూరులో లైట్లు వెలిగాయి

గత కొన్నేళ్లుగా లో ఓల్టేజి సమస్యను ఎదుర్కొంటున్న లేబూరు గ్రామస్తుల సమస్య ఎట్టకేలకు గత వారం తీరిపోయి ప్రస్తుతం లైట్లు ధగధగ వెలుగుతున్నాయి. గ్రామంలో ఒక మూల ఉన్న ట్రాన్స్‌ఫార్మరకు లోడు ఎక్కువై విద్యుత్ దీపాలు గుడ్డిదీపాలు గా వెలిగెవి. ఈ దుస్థితి గూర్చి గ్రామస్తులు విద్యుత్ శాఖాధికారులకు, రాజకీయ నాయకులకు విన్నవించినా ఫలితం లేకుండా పోయింది. గతవారం లేబూరు గ్రామంలో ఉన్న బంధుత్వం వల్ల రాష్ట్ర విద్యుత్ బోర్డు ఛైర్మన్ శ్రీ కె. బలరామిరెడ్డి లేబూరు వచ్చారు. గ్రామస్తులు తెలివైన పథకం వేసారు. రాత్రి భోజనం చేయాలని పట్టుబట్టారు. వాస్తవం తెలియని ఛైర్మన్ సరేనని సాయంత్రం వరకు ఉండేసరికి అసలు విషయం బోధ పడింది. అప్పటికప్పుడే మరో ట్రాన్స్‌ఫార్మర్ ఏర్పాటు ఉత్తర్వు జారీ చేశారు. మరుసటి రోజే విద్యుత్ శాఖాధికార్లు గ్రామం నడిబొడ్డులో దాన్ని ఏర్పాటు చేయడం వల్ల ప్రస్తుతం గ్రామంలో వెలుగులు చిమ్ముతున్నాయి. జిల్లాలో ఇటువంటి గ్రామాలు కోకొల్లలు రెడ్డి గారూ- ఎన్ని గ్రామాల వారు మీకు రాత్రి డిన్నర్ ఏర్పాటు చేయగలరు, మీరెన్ని గ్రామాలలో తినగలరు??

### శీనయ్య పర్యటన

కోవూరు శాసనసభ్యుడు, మాజీ మంత్రి శ్రీనల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి అక్టోబరు 26 తేదీ నుండి నవంబర్ 3 తేదీ వరకు నెల్లూరులో ఉంటారు. ఆయన పర్యటన వివరం ఇదీ - 30,31 తేదీల్లో కోటలో ఉంటారు. 1 తే దీ గ 2,3 తేదుల్లో దర్గామిట్టలోని తన స్వగృహంలో విడిది. ఆ సమయాల్లో ప్రజలు తనను కలుసుకోవచ్చునంటున్నారు శీనయ్య.

### దంగ సారా

తోటపల్లి గూడూరు మండలం అనంతపురం గ్రామంలోని దెండిళ్లపై నెల్లూరు ఆర్డీవో శ్రీ టి.ఎస్. ప్రసాద 25 తేది దాడిచేసి 25వేల రూపాయల విలువ చేసే అక్రమ సారాను పట్టుకొన్నారు. ఈ సందర్భంగా జి. సుబ్బయ్య, యు. సుబ్బయ్య అనే వ్యక్తులను అదుపులోకి తీసుకొన్నారు. ముత్తుకూరు మండలం బ్రహ్మదేవం గ్రామస్థులు వి. రమణయ్య, వి. శీనయ్యలను అదుపులోకి తీసుకొని వారి వద్దనుండి అక్రమ సారా తయారీ పనిముట్లు కూడా స్వాధీనం చేసుకొన్నారు.

### కందలపాడులో పట్టాల పంపిణీ

వెంకటాచలం మండలం కందలపాడు గ్రామంలో 18 తేది 160 మంది నిరుపేదలకు నివేశన భూమి పట్టాలను రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఎన్. వెంకటరత్నం నాయుడు అందజేశారు. వీరిలో 106 మంది హరిజనులు:54 మంది వెనుకబడిన కుటుంబాల వారు.ఈ సందర్భంగాఎమ్మెల్యే మాట్లాడుతూ కందలపాడుకు రోడ్డు వేయించను 2 లక్షల రూపాయలు మంజూరు చేయిస్తానని, పాఠశాలలో ఖాళీగా ఉన్న టీచర్ పోస్ట్ భర్తీ చేస్తానని హామి ఇచ్చారు. కార్యక్రమంలో ఎమ్మార్వో శ్రీ డి. శ్రీనివాసులు రెడ్డి ఇతర అధికారులు పాల్గొన్నారు.

## జనవాణి

(3 పేజీ కొరవ)

135రూపాయలు, పురుషులకు 125 రూపాయల పారితోషికం ప్రభుత్వం ఇస్తున్నది. 1983నుండి ఈ విధానం కొనసాగుతుంది. కాని కుటుంబ నియంత్రణ చేయించుకున్న మహిళలు ఆపరేషన్ చేయించుకున్నాక కనీసం ఐదురోజులైనా ఆస్పత్రిలో ఉండాలి. కూలీ నాలీ చేసుకొనే సామాన్య జనం ఈ ఐదురోజులూ జబ్బు అనుభవించడానికి పారితోషికాన్ని 200రూపాయలకు పెంచాలని కోరుతున్నాము.

-కె.రామసుబ్బారెడ్డి

రాముడుపాళెం.

## పంచాంగము

తేది 6 శుక్రవారము విశాఖ కార్తె ప్రారంభము

### ముహూర్తములు

తేది 1 ఆదివారము ఉదయం 5.10 గంటలకు కన్యాలగ్నమున వివాహ గృహారంభ గృహప్రవేశములకు

తేది 5 గురువారము ఉదయము 4.35 గంటలకు కన్యాలగ్నమున వివాహ గృహప్రవేశములకు సుముహూర్తములు

### అక్టోబరు నెల తిథులు

31 తేది శని షష్ఠి రాత్రి 12.25 గంటలకు

### నవంబరు నెల తిథులు

తే 1 ఆది సప్తమి రా.గ. 1.42 గ
తే 2 సోమ అష్టమి రా.గ. 3.30 గ
తే 3 మంగళ నవమి రా.గ. 5.30 గ
తే 4 బుధ దశమి పూర్తిగ
తే 5 గురు దశమి ఉ.గ. 7.45 గ
తే 6 శుక్ర ఏకాదశి ఉ.గ. 9.30 గ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ



మావారికి పెళ్ళంటలో సితార

### ఇదీ తెలుగు సినిమాల దుర్గతి

# గ్యాంగ్‌వార్‌కు 75 కట్స్

విపరీతమైన హింస, ద్వంద్వార్థపు బూతు మాటల ప్రయోగం వగైరాల కారణంగా కోడిరామకృష్ణ దర్శకత్వం వహించిన "గ్యాంగ్‌వార్" చిత్రాన్ని సెన్సార్ వారు సెన్సార్ చేయడానికి నిరాకరించడం అపూర్వమైన విషయం. రివైజింగ్ కమిటీ వారు 75 కట్స్ సూచించారు. అంటే - చిత్రం మొత్తం నిడివిలో నాలుగో వంతు కత్తెరకు గురి అయినట్లే. నిర్మాతలు ఏం చేస్తారో.

## తోటి హీరోలతో అక్కినేని

అక్కినేని నాగేశ్వరరావు ఈ తరం హీరోలతో కలిసి నటించే కొన్ని చిత్రాలు త్వరలో ప్రారంభం కానున్న విషయం ఆయన అభిమానులకు అమితానందం కలిగించగలదు. బి.గోపాల్ దర్శకత్వంలో త్వరలో ప్రారంభమయ్యే చిత్రంలో చిరంజీవితో; ప్రియదర్శన్ దర్శకత్వంలో శ్రీ లక్ష్మీనరసింహాకంబైన్స్ నిర్మించే చిత్రంలో బాలకృష్ణతో ఎ.ఎన్.ఆర్. కలిసి నటించనున్నారు. శరత్ దర్శకత్వంలో బూరుగుపల్లి బుల్లి సుబ్బారావు నిర్మించే చిత్రంలో అక్కినేనితో పాటు వినోద్‌కుమార్ నటిస్తున్నారు. ఈ చిత్రంలో నాయికగా బొంబాయి తార రవీనాటాండన్‌ను 11లక్షలకు బుక్ చేశారట!

## జయసుధ చిత్రంలో జయప్రద, శోభన్

"వింతకోడళ్లు" అనంతరం జయసుధ సమర్పించే జె.ఎస్.కె. కంబైన్స్ చిత్రంలో అమెతోపాటు జయప్రద, శోభన్‌బాబు నటించే సబ్జెక్ట్ సిద్ధంగా ఉందని ఆమె భర్త నితిన్ కపూర్ తెలిపారు.

## "అంబేద్కర్" చిత్రానికి అన్యాయం

"డాక్టర్ అంబేద్కర్" చిత్రం పత్రికల, ప్రముఖుల ప్రశంసలందుకుంది. కాని సరైన పబ్లిసిటీ లేక పోవడం వల్ల ఎక్కువ ప్రదర్శనలకు నోచుకోలేక పోయింది. కనీసం "పనోరమ"కు కూడా ఎంపిక కాక పోవడం ఎంతో శోచనీయమని

6రవ 11 పేజిలో

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వద్దులు

1) శ్రీ భారతి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 131, 94,బి. ప్రకాశం రోడ్డు, తిరుపతి వారి తాలూకు 9.1.91 నుండి 21.9.91 తేది వరకు గల కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని పద్దులు. 7.11.92 తేది వుదయం 10 గంటల నుండి 94బి, ప్రకాశం రోడ్డు తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) నందా అండ్ కో పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 189; 193,బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 18.4.89 నుండి 16.3.91 తేది వరకు గల విడిపించని పద్దులు 12.11.92 తేది వుదయం 10 గంటల నుండి 193, బజారువీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) మెసెర్స్ కామధేను అండ్ కో పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం.60, 8/71,బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3.1.91 నుండి 28.6.91 తేది వరకు గల విడిపించని పద్దులుగా ప్రకటించిన ప్రకారం 16.10.92 తేదిన వేలము జరుగలేదు. కావున 14.11.92 తేది వుదయం 10 గంటల నుండి 87/1,బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) యమ్. సాగరమల్‌జైన్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్.నం. 50, 8/188,బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5.1.91 నుండి29.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు లోగా ప్రకటించిన ప్రకారం . 15.10.92 తేదిన వేలము జరుగలేదు. కావున 16.11.92 తేది వుదయం 10 గంటల నుండి 8/188, బజారువీధిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) ఆర్. రాధేశ్యాము పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 283; 20.3.872బి, కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8.4.91 నుండి 4.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు 29.11.92 తేది వుదయం 10 గంటల నుండి 20.3.87 బి, కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) ఎ. సత్యనారాయణ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 142; 18.2.4కొరగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 20.11.88 నుండి 12.8.91 తేది వరకు గలవిడిపించని పద్దులు 21.11.92 తేది వుదయం 10గంటల నుండి 18.2.4 కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) జి. ధోకల్‌రామ్ పటేల్ పాన్ బ్రోకర్స్, పి.బి.యల్. నం. 173, 13.1.22ఎ పెద్దకాపువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3.9.91 నుండి 28.9.91తేది వరకు గల విడిపించని పద్దులు 23.11.92 తేది వుదయం 11 గంటల నుండి 13.1.22ఎ, పెద్ద కాపువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

8) జె. నర్సింగ్‌లాల్ శర్మ - పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం.145; 8/201, బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5.4.87 నుండి 12.5.91 తేది వుదయం వరకు గల విడిపించని పద్దులు 30.11.92 తేది వుదయం 10 గంటల నుండి 8/201 బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

9) వి.కన్నావారి సన్స్ యొక్క పాన్ బ్రోకర్స్, పి.బి.యల్.నం. 170; 74 బజారువీధి, తిరుపతి వారి కాలపరిమితి గడిచిప్పటికి 15.8.90 నుండి 6.10.91 తేది వరకు గల విడిపించని పద్దులు 15.11.92 తేది వుదయం 10ల నుండి 74, బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణరావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు

### చెత్త కథ, చచ్చు పాత్రలు, చండాలపు సన్నివేశాలు

# దొంగ-పోలీసు

**చిత్ర సమీక్ష**

***

**గిద్దలూరు గోపాలరావు**

ఈనాటి సినిమాల నిర్మాణం హీరోల మీద ఆధారపడి సాగుతూవుంది. పేరున్న హీరో వుంటేనే చిత్రం వెలపోతూ వుంది, విడుదలవుతూవుంది. ప్రేక్షకులూ ఆదరి స్తున్నారు. పేరులేని హీరోతో ధైర్యంచేసి ఏ తలమాసిన నిర్మాతైనా సినిమా తీస్తే, అది మూలబడి వుండ వలసిందే. కొనే వాడే వుండరు. అందుచేత నిర్మాతలు పేరున్న హీరోలకోసం ప్రాకులా డుతుంటారు. ఆ పేరున్న హీరో ఇమేజ్ పెంచేందుకు దర్శకుడు నానా పాట్లు పడుతుంటాడు. హీరో ఇమేజ్ ఎంతబాగా పెంచితే ప్రేక్షకులు అంత గొప్పగా చిత్రాన్ని ఆదరిస్తారని దర్శకులు, నిర్మాతల నమ్మకం.

హీరో ఇమేజ్ పెంచేందుకు మోహన్‌బాబు హీరోగా నటించిన దొంగ పోలీస్ చిత్రంలో దర్శకుడు కె.యస్. ప్రకాష్ చాలా పోకడలు పొయ్యాడు. మోహన్‌బాబు ఇమేజ్ పెంచేందుకు పాటిం చిన సూత్రాలు అన్నీ పాతవే. పాత్రలు, సన్నివేశాలు కూడా చాలా చిత్రాల్లో చూచినవే. అసలు చిత్రకథకూడా అతుకుల బొంత! పాత సినిమాల్లోనివి ఒక్కో సినిమానుంచి ఒక్కో అంశం తీసుకొని రమణి, యం.బాలూను జతగా అతికించి కథ అల్లారు. ఈ అల్లిక చాలా సాధారణంగా, నిస్సారంగా వుంది. ఈ కారణాలవల్ల, దర్శకుడు హీరో ఇమేజ్ పెంచేందుకు ఎన్ని అవస్థలు పడ్డాడని సినిమా సొదిలోకి రాకుండా పోయింది.

రాంబాబు (మోహన్‌బాబు) అనే హీరోకు వ్యతిరేకంగా ఇద్దరు విలన్లుంటారు. ఒకతను టింబర్ సాంబయ్య. (కోటశ్రీనివాసరావు); మరొ కతను చక్రవర్తి (భూషణ్). చక్రవర్తి ఫారెస్టు కాంట్రాక్టరు. ఇతను దొంగతనంగా సరఫరా చేసే కలపను సాంబయ్య అమ్ముతుంటాడు. చక్రవర్తి డబ్బుతో ఓట్లు కొని పంచాయితీ ప్రెసిడెంటవుతాడు. చక్రవర్తికి చట్టమంటే భయం లేదు. అతను చేసే దుండగాలకు పరిమితంలేదు. ఇటువంటి విలన్ల ఆటకట్టించడమే కదా తెలుగు హీరోల పని. ఈ ఆటలను అవకాశంగా తీసుకొని దర్శకుడు హీరో ఇమేజ్ పెంచాలనుకున్నాడు. వాటిల్లో మొదటిది చట్టం అంటే భయం లేని చక్రవర్తికి బుద్ధిచెప్పేందుకు హీరో రాంబాబు చట్టాన్ని తనచేతుల్లోకి తీసుకోవటం. ఆ ప్రాంతానికి కొత్తగా వచ్చిన పోలీస్ ఆఫీసర్ని (అచ్యుత్) కిడ్నాప్‌చేసి తన యింట్లో బంధించి, తాను పోలీస్ ఆఫీసరుగా వ్యవహరిస్తూ చక్రవర్తి భరతం పట్టారు. ముసుగు వేషంలో వెళ్లి చక్రవర్తి అపహరించుక పోయిన తన చెల్లెల్ని విడి పించుకొని వస్తాడు. ఈ సంఘటన జరిగిన తర్వాత, ఆ ఫూళ్లో ఆయాగా పనిచేస్తున్న ఆమె చక్రవర్తి సాగించే మానభంగాలు ఆపమని వేడుకోవటంతో, రాంబాబు విజృంభించి, దుష్టశిక్షణ శిష్టరక్షణకు కంకణం కట్టుకుంటాడు. అలాగే తన ప్రియురాలు గారి (మమతా కులకర్ణి) తన అన్నను, వదినను, మొదటి విలన్ సాంబయ్య ఘోరంగా చంపాడని చెప్పటంతో సాంబయ్యను ఉతికి ఆరేస్తాడు. ఇలా సాగుతాయి హీరో ఇమేజికి సంబంధించిన విషయాలు.

లారీ డ్రయివరుగా బ్రతుకు సాగించే హీరో రాంబాబు పాత్ర హడావుడిగా కనిపిస్తుంది. ఆద్యంతం అలుపూ సొలుపూ లేకుండా తెగ వాగేస్తుంది. దర్శకుడు ఈ పాత్రను హాస్య ప్రధానంగా మలిచేందుకు ప్రయత్నిం చాడు. అదంత బాగా ఫలించలేదు. మోహన్‌బాబు ఈ తరహా పాత్రల్లో బాగా నటించగలడు. అందులోనూ రాణించాడు.

6రవ 11 పేజిలో

## పినాకినీ తీరం

(2 పేజీ తరువా)

గుచ్చిగుచ్చి అడిగి తెలుసుకున్నారనుకున్నారు! అహోరాత్రులు కొత్త భవనం సముదాయంలో గడిగించిని మాట విని ఎంతో సంతోషించారు. మా కుటుంబాల సభ్యులను గూర్చి, పాత వారి యోగక్షేమాలు, కొత్త వారి వివరాలు తెలుసుకొన్నారు. సందర్శకులు ప్రవాహంలా వచ్చిపోతూనే వున్నారు; అయినా వస్తూ ఒక అర్ధగంట విలేకరు అదంతా వ్యవహారం చెప్పుకోవడానికి గాదు. రంగా గారు మానసికంగా స్వస్థులుగా వున్నారని నాకు కలిగిన అభిప్రాయాన్ని వివరించడానికే!

కాని వృద్ధాప్యంలో విరగకూడని రేటు ఎముక విరిగింది. దాన్ని బాగు చేశారు. అయినా ఆయన మామూలుగా నడువగలుగుతారా? రంగా గారిలో ఆత్మవిశ్వాసం అపారం. ఆయనన్నారు: - "ఇక వాకింగ్ ఎయిడ్ ఆధారంగా తిన్నగా నడవడం మొదలు పెట్టాలి" అని. ఆ వుత్సాహము, విశ్వాసము వుంటే నడవవచ్చు. కాని ఇతర కాంప్లికేషన్లు ఏమీ సంభవించకుండా వుండాలి. ఏమైనా గొంతు ఫీలింగ్ అంటూ మామూలుగా వున్నా, ఇక చక చకా నడక సాధ్యంకాక పోవచ్చు.

నవంబరు 7 తేదితో రంగా గారికి 92 సంవత్సరాలు పూర్తి అవుతాయి; 93 వ జన్మదినం నాటికి ఆయన ఆరోగ్యవంతుడు కావాలి. మరో పదేళ్లయినా పూర్తి చేయాలని నా ప్రార్థన. 'గోదావరి' నుండి గిన్నిస్ బుక్ వరకు ఎదిగినా, అరవై ఏళ్ల పార్లమెంటరీ జీవితం వున్నా ఆయనలో అనుమంత కూడా భేషజం కనపడదు. అధికారపు హద్దులకు బయట వుంటినందు వల్లనేమో, రంగాగారి వంటి నిస్వార్థ రాజయోగిలో ఆ ఆప్యాయతలు అనురాగాలు చెక్కు చెదరకుండా వున్నాయి. కలలో తప్ప రాజకీయ నాయకులలో కనపడని గుణసంపద అది. రంగాగారు ఆస్పత్రిలో కూడా, కీర్తిశేషురాలైన తన ప్రియ సతీమణి శ్రీమతి భారతీ దేవి చిన్న రూపపటాన్ని ఎదురుగా ఒక బల్లమీద వుంచి చూచుకుంటున్నారు; ఆ అనురాగ దంపతులను విడదీసిన దైవం ఎంత క్రూరుడా అనిపించింది.

### ఆ పెంచలయ్యే!

జిల్లాలో మంత్రి అయిన తొలి హరిజన శాసనసభ్యుడు శ్రీ పసల పెంచలయ్య. ఆంధ్రప్రదేశ్ వచ్చిన తర్వాత మంత్రులైన తొమ్మిది మందిలో బెజవాడ గోపాలరెడ్డి గారి నుండి నేటి వరకు, క్యాబినెట్ హోదాతో మంత్రి అయిన ఆరవ కాంగ్రెస్ వారి పెంచలయ్య. శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డిది కూడా క్యాబినెట్ హోదా మంత్రిత్వమే గాని అది కాంగ్రెస్, తెలుగుదేశం రెంటిలో కొనసాగింది. కత్తిలేని తెలుగుదేశం క్యాబినెట్ హోదామంత్రి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి. పెంచలయ్య మంత్రిత్వంలో విశేషం స్వర్గీయ బద్దెపూడి వెంకట నారాయణ రెడ్డి గారి తర్వాత సూళ్లూరుపేట నియోజక వర్గీయుడు మంత్రిగావడం. మరో విశేషం గురువు శ్రీ జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిత్వంలో కాక, ఆయన వైదలగిన తర్వాత ఆయన చేతనే మంత్రిచేయబడడం. ఇంకో విశేషం - ప్రభుత్వోద్యోగానికి స్వస్తి చెప్పి పార్లమెంటరీ రంగంలో దిగి, మంత్రి అయిన తొలి నెల్లూరీయుడు కూడా పెంచలయ్యే. చెప్పుకోవాలంటే మరో రెండు విశేషాలు కూడా వున్నాయి -సూళ్లూరుపేట నియోజక వర్గం నుండి ఎన్నికైన శాసనసభ్యులలో త్రాగుడులేని పరిశుద్ధ యువకుడు; పల్లెలకు, ప్రజలకు అత్యంత సన్నిహితుడై పోయిన వాడు పెంచలయ్య. ఇన్ని విశేషాలతో కూడిన విలక్షణ మంత్రిత్వం పెంచలయ్యది. పెంచలయ్యను గూర్చి, పెంచలయ్య మంత్రిత్వాన్ని గూర్చి వ్రాయడం పొగడ్తలా వుంది గదూ? కాని ఇందులో అక్షరం పొల్లులేదు!

రాజకీయవాదుల్లో ఏ సంఘటన ఎప్పుడు ఎందుకు జరుగుతుందో చెప్పలేము. ఎప్పుడు ఏమి సంభవిస్తుందో చూడలేము. భవిష్యత్తు చూడలేని అతని వర్తమాన నిర్ణయం మున్ముందు ఏ ఫలితాన్ని తెచ్చిపెడుతుందో వూహించలేము. ఒక రకంగా అనుకుంటే తద్భిన్నంగా జరుగుతుంటుంది. శాస్త్ర విజ్ఞానానికి అంతుబట్టని సృష్టి రహస్యం అది.

పెంచలయ్య అనుకున్నదొకటి, అయిందొకటి. 1989 ఎన్నికలలో పార్లమెంటుకు పోవాలనుకున్నాడు; దాని కోసం విశ్వప్రయత్నం చేశాడు; కాలేదు. ఒక్కసారి మంత్రి చెయ్యి గణనాథ అని వాహినీ వారి పెద్ద మనుషులన్నట్లు పార్లమెంటు సభ్యత్వంలో ఏదో ప్రత్యేకమైన మజా వున్నట్లుంది. దేశ రాజధాని నగరంలో వుండడం; జాతీయ నాయకులు మహా నాయకులతో ప్రత్యక్ష పరిచయాలకు సంబంధాలకు అవకాశముండడం; పదవి ప్రమోషన్ల ప్రయత్నానికి వీలుండడం; పార్లమెంటులో ఒకటి రెండు మాటలు మాట్లాడినా దేశ వ్యాప్త ప్రాముఖ్యం లభించడం; ఫస్ట్ క్లాస్ రైలు, ఏర్ ప్రయాణాలు వుచితం కావడం; ఢిల్లీ జీవితం హైలా హుషారుగా, సుఖమయంగా వుండడం; ఎం.పి. మాటంటే కేంద్ర ప్రభుత్వ శాఖల్లో తిరుగులేకుండా చెలామణి కావడం, విశాల రంగానికి సంబంధించిన పార్లమెంటు సభ్యత్వంలోని ఆకర్షణలు. రాజును చూచిన కంట మొగుణ్ణి చూచినట్లు, పార్లమెంటు సభ్యుడుగా వుండిన వారికి రాష్ట్ర శాసనసభకు రావడానికి బుద్ధి పుట్టదు. శాసన సభ పోటీకి తొలుత పెంచలయ్య విముఖతకు కారణం అదిగానే వుంటుంది.

కాని పెంచలయ్యకు మేము మొదట్లోనే చెప్పాము. ప్రాశాము కూడా - శాసన సభకు వస్తే వుజ్వల భవిష్యత్తు వుండవచ్చునని! మేము ఆనాడు ఆ విధంగా అభిప్రాయ పడడానికి కారణం పెంచలయ్య ఢిల్లీలో కంటే ఇక్కడే బాగా రాణించగలడని; విద్యాధికుడు చురుకైన వాడు కాబట్టి మంత్రిత్వం వంటి వున్నత స్థానాలకు అవకాశముండ వచ్చుననేదే! పెంచలయ్య కొంత ముందు వెనుకలాడాడు గూడూరు కాంగ్రెస్ అభ్యర్థిత్వం పట్రా ప్రకాశరావుని పెనవేసుకుంది; ఇక పోటీ చేస్తే సూళ్లూరుపేట నుండి పోటీ చేయాలి; సూళ్లూరుపేట కాంగ్రెస్‌కు, గ్రూపు పరంగా వ్యక్తిగతంగా కూడా అనుకూలం కాదు, అక్కడ విజయం సందేహాస్పదమని భయపడ్డాడు.చివరకు పోటీకి సమ్మతపడక తప్పలేదు; అభ్యర్థిత్వమూ హోరాహోరీ పోటీలో చివరి నిముషంలో వచ్చింది - గెల్చాడు; నియోజక వర్గం గ్రామాలలో, ఏ శాసనసభ్యుడూ, ఏ రాజకీయ నాయకుడూ పాదం మోపని కుప్పంలలో కూడా తెగ తిరిగాడు. ప్రజల నిత్య సమస్యలకు తన కాలాన్ని వినియోగిస్తున్నాడు, వారి మధ్యనే వుంటున్నాడు, ఎవ్వరూ వూహించని విధంగా పాపులర్ శాసనసభ్యుడుగా పేరు తెచ్చుకున్నాడు. అదే విధంగా మంత్రికాగలిగాడు. మా అభిప్రాయం, సలహా పొరపాటు కానందుకు మాకు సంతోషమైంది.

ఇది పెంచలయ్యకు సంబంధించిన పాత కథ. ఆరు నెలలైనా గడవందే చెప్పలేమనుకోండి;! 1978 కి ముందు డి.పి.ఆర్.ఓ.గా ఏ పెంచలయ్యో, తర్వాత పార్లమెంటు సభ్యుడుగా ఏ పెంచలయ్యో, ఏడేళ్ల రాజకీయ అజ్ఞాత వాసంలో ఏ పెంచలయ్యో, మూడేళ్ల శాసనసభ్యత్వంలో ఏ పెంచలయ్యో, మంత్రిగా ఈనాడు సైతం ఆ పెంచలయ్యగానే వున్నాడు. వ్యక్తిత్వం వుంది -భేషజం లేదు; చదువు సంస్కారాలున్నాయి -గర్వంలేదు; తొందరపాటు తనం వుంది -దానితోటి విజ్ఞతా వుంది; పేద, మధ్యతరగతి వారికి సన్నిహితుడు - కాని పై తరగతి వారిని ద్వేషించడు; ఢిల్లీ హైదరాబాదు వాతావరణాలలో కూడా ఏ వ్యసనానికీ గురికానివ్యక్తి;నెల్లూరు జిల్లాకు సంబంధించి 1937 నుండి నేటివరకు ఎన్నికైన హరిజన శాసన సభ్యులలో కీ.శే. కమతం షణ్ముఖం తర్వాత ఎన్నదగినవాడు. పెంచలయ్యను గూర్చి నాకు ఏర్పడిన అభిప్రాయాలివి. వీటిని మార్చుకోవలసిన అవసరం కలుగ గూడదని నా ఆకాంక్ష.

ఆఖరుగా ఒక మాట. పెంచలయ్యకు తేలిక శాఖ ఇచ్చారు. ఇంకా బరువు మోయగలిగిన సమర్థుడైన యువకుడు. శ్రీ విజయభాస్కర రెడ్డి గారు పెంచలయ్య భుజాలకు తగిన బరువెత్తి వుపయోగపెట్టుకోవడం బాగుంటుంది.



సమాచార మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన పసల పెంచలయ్యను దగ్గరుండి ఆఫీసు ప్రవేశం చేయిస్తున్న మాజీ మంత్రి మాదాల జానకి రాం, ఎమ్పీ మాగుంట సుబ్బరామ రెడ్డి.

## సింహపురి

(4 పేజీ తరువా)

ప్రామాణిక గ్రంథాలను ప్రచురించడం ఆయన కార్యక్రమం. దాదాపు వంద చోట్ల భగవద్గీతా యజ్ఞాలు నిర్వహించారు.

నెల్లూరు సభలో స్వామిజీ అద్భుత ప్రసంగం చేశారు. దాదాపు రెండు గంటలపాటు గ్రుక్క త్రిప్పుకోకుండా, ఊపిరి సల్పకుండా సాగిందా ప్రసంగం. "పదివేల సంవత్సరాల క్రితం మానవుడికి బాధలు, కన్నీళ్లు, దుఃఖాలు వున్నట్లే, ఈనాడూ వున్నాయి. ఎంతో అభివృద్ధి సాధించా మనుకుంటున్న మనం దుఃఖాన్ని దూరం చేసుకోలేక పోతున్నాం. అనంతమైన సుఖాల కోసం అన్వేషణ చేసుకుంటూ శోకోద్వేగం, దిగులు, బాధ, విచారాలు పెరుగుతూ పోతున్నాయి; అశాశ్వతమైన సుఖాలకోసం మానవుడు ప్రాకులాడడమే దీనికి కారణం. నిత్యము, సత్యము అయిన భగవంతుడ్నినిత్యమూ ధ్యానించడం ద్వారా మాత్రమే శాశ్వతమైన సుఖం ప్రాప్తిస్తుంది. ఏ పని చేస్తున్నా భగవంతుడి రూపాన్ని మనసులో ప్రతిష్ఠించుకొని, భగవన్నామ స్మరణ చేయడం ద్వారా మానసిక ఆనందం పొందవచ్చు" అంటారు స్వామీజీ. చేతులతో కాకుండా చేతలతో పూజ చేయడం ద్వారా, నిత్యకార్యకలాపాలలో ఆధ్యాత్మిక విలువలను నైతిక ప్రమాణాలను పాటించడం ద్వారా, సరైన మార్గంలో ఉన్న స్థానంనుంచి, ఉన్నత స్థానానికి ఎదిగేందుకు ప్రయత్నించడం ద్వారా, మనం ఆధార పడివున్న సమాజానికి చేతనైన సేవచేయడం ద్వారా భగవంతుడికి చేరువ కావచ్చునని స్వామీజీ ప్రబోధం.

ఈ సభను ఒంగోలు పార్లమెంట్ సభ్యులు శ్రీమాగుంట సుబ్బరామరెడ్డి అధ్యక్షించారు. శ్రీ ఆనం వివేకానందరెడ్డి, శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి మాట్లాడారు. శ్రీ అనపల్లి అశోక కుమారరెడ్డి జ్యోతి వెలిగించారు. నెల్లూరు సత్సంగ్ కన్వీనర్- రైతుబిడ్డ శ్రీనివాసరావు స్వాగత, వందనా లాచరించారు.

సభకు వచ్చిన జన సందోహం కంటే, రెండున్నర గంటల పాటు ఒక్కరు కదలకుండా కూర్చోవడం విశేషం. అంతగా వారిని మంత్రముగ్ధులను చేశాడాయన.

## గ్యాంగ్ వార్

(9 పేజీ తరువాయి)

ఎఫ్.డి.సి. ఛైర్మన్ శ్రీ ఎం.ఎస్.రెడ్డి ఒక సభలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డి సమక్షంలో తన బాధను వ్యక్తంచేశారు. "పనోరమ కమిటీ ఏ ఒక్కరి చేతుల్లో లేదు. నేను ఛైర్మన్‌ను అయినా నాకు కొన్ని పరిమితులు ఉంటాయి. ఎంపిక కోసం వచ్చిన స్వాతికిరణం, అంబేద్కర్, సూరిగాడు, కాలేజిబుల్లోడు, నాలుగు చిత్రాలలో "సూరిగాడు" మాత్రమే ఎంపిక అయింది. "అంటూ వేదిక మీదే సుబ్బరామిరెడ్డి వివరణ ఇచ్చారు.

### కుమారులతో గిరిబాబు సొంత చిత్రం

నటుడు గిరిబాబు స్వీయ దర్శకత్వంలో రూపొందించే చిత్రం షూటింగ్ జనవరిలో ప్రారంభమౌతుంది. ఆయన కొడుకులు బోసుబాబు, రఘుబాబు హీరోలు.

### తల్లి పలకరింతకు తబ్బిబ్బయిన ఐశ్వర్య

ఐశ్వర్యలో ఇటీవల ఏదో నూతనోత్సాహం కనిపిస్తోంది. తల్లి లక్ష్మి ఆమెను పలకరించిందట. అదీ విశేషం. "మాబంధువు ఒకరింట్లో పెళ్ళి సందర్భంలో చాలాకాలం తర్వాత అమ్మ, నేనూ తారసపడ్డాం. ముందు మా అమ్మే పలకరించింది. ఎంతైనా కన్న తీపి కదా! నువ్వు యాక్టుచేసిన చాలా చిత్రాలు చూశానమ్మాయ్. చాలా బాగా చేస్తున్నావు. కీప్‌ఇట్‌అప్! అంది అమ్మ. నుదుటిమీద ముద్దు పెట్టుకుంది కూడా. ఉబ్బితబ్బిబ్బయి పోయాను. ఇక అమ్మనూ, మా నాన్న భాస్కర్ గారినీ ఒకటి చేయాలి. అదీ జరుగు తుందనుకుంటా! మొత్తం మీద మా అమ్మ పలకరించడంతో ఇంతకాలం మా ఇద్దరి మధ్యనున్న అడ్డుగోడ పడిపోయినట్లే . ఇది ఏ మంచికి దారి తీస్తుందో వేచి చూడాలి," అంది ఐశ్వర్య.

### ప్రేక్షకుల సంఖ్య తగ్గుతోంది!

థియేటర్‌కు, వెళ్ళే వాహనాల రవాణా చార్జీలు పెరిగాయి. టిక్కెట్ల ధరలూ పెరిగాయి. ఇన్ని పెరిగినా ప్రేక్షకులను ఆకట్టుకునే కథా, కథనం గల చిత్రాలు రావడం లేదు. అశ్లీల సన్నివేశాలు, అర్ధనగ్ననృత్యాలు ప్రేక్షకులకు వెగటు కలిగిస్తున్నాయి. చిన్న పిల్లలతో, పెళ్ళైదు పిల్లలతో సినిమాలకు వెళ్లడానికి ఎవరికీ మనసొప్పడం లేదు. అందుకే చాలా మంది స్టార్ టి.వి./కేబుల్ టి.వి. కనెక్షన్‌లు తీసుకుంటున్నారు. ఇక దర్శక నిర్మాతల ఆలోచనా సరళిలో మార్పురావలసిన సమయం ఆసన్నమైంది. సమాజానికి సేవ చేయకపోయినా, సమాజానికి హాని కలిగించని రీతిలో తయారయ్యే చిత్రాలనే అందరూ వాంఛిస్తున్నారని ఒక పాత్రికేయుడు చేసిన సర్వేవల్ల తేలింది. దర్శక నిర్మాతలారా! బహుపరాక్! తొందరపడి రీళ్ళు సిద్ధంచేయకండి. భారీ తారాగణం, బ్రహ్మాండమైన సెట్లు, అధిక వ్యయం మాచిత్రాలకు ప్రాణం పోయలేవని ఇటీవల విడుదలైన కొన్ని చిత్రాల ద్వారా తెలుస్తోంది కదా? రోజులు మారాయి. ప్రేక్షకుల అభిరుచులూ మారాయి. ఇక మారవలసింది మీరే!

### నటి జయలలిత వివాహం

అర్ధనగ్నంగా నటించడానికి 'సై' అనే తెలుగు అత పడుచు జయలలిత మలయాళ చిత్ర దర్శకుడు వినోద్‌ను ఎర్నాకుళంలో వివాహం చేసుకుంది. తన కుమార్తె కల్పవృక్షం, కామధేనువు అని నమ్మి ఇంతకాలం అష్ట సన్యాసం చేసి వుండిన ఆమె తండ్రి, జర్నలిస్టు శిలానందకు మళ్లీ కలాన్ని చేతబట్ట వలసిన అవసరం ఏర్పడింది.

### నిరాశా నిస్పృహలు

"ఆపద్బాంధవుడు" అపజయం పొందడం సినిమా పరిశ్రమలో పలువురిని ఆలోచనల్లో ముంచెత్తింది. చిరంజీవి - విశ్వనాథ్ కాంబినేషన్ కలిగిన ఈ చిత్రంనాలుగు కోట్ల బిజినెస్ చేసింది. కాని, బయ్యర్లు విపరీతంగా నష్టపోయారు. "దంగ-పోలీసు" చిత్రం గురించిన వార్తలు కూడా ఎంతో నిరాశను కల్గిస్తున్నాయి. భారీ తారాగణం, భారీ సెట్టింగులు, విదేశాలలో షూటింగ్‌లు కూడా "దంగపోలీస్"చిత్రాన్ని బాగా ఆడించలేక పోయాయి. అలాంటప్పుడు అంతవ్యయం చేసి ప్రయోజనమేమిటి? దేశంలో ఎక్కడా లేనంతగా 8 శాతం పన్ను, ఇతర రాయితీలను రాష్ట్ర ప్రభుత్వం కల్పించినప్పుడు నిర్మాతలు పోటీకి పోయి కోట్లాది రూపాయలు వెచ్చించడమెందుకు? ఆ రేంజ్‌లో కొన్న కొనుగోలుదారులకు నిస్పృహ కల్గించడమెందుకు?

### రూపశిల్పికుమార్ స్వంత చిత్రం

నెల్లూరీయుడు మేకప్ ఆర్టిస్ట్ అయిన రూపశిల్పి కుమార్ సమర్పణలో తాజాగా చిత్రాంజలి బేనర్‌పై 'ఎదురింటి రాధ' చిత్రాన్ని రూపొందించారు. ప్రేమ, సెంటిమెంట్, కామెడీ మేళవింపులతో రూపొందిన ఈ చిత్రంలో నూతన నటీనటులు నటిస్తున్నారు. సంగీతాన్ని బి.గోపాలం అందిస్తుండగా, రూపశిల్పి కుమార్ తనయుడు అశోక్ కుమార్ కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తున్నాడు. నిర్మాత కె. రాజేంద్ర. చిత్రం సెన్సారు పూర్తయి విడుదలకు సిద్ధంగా వుంది.

## రైతులోకం

(3 పేజీ తరువాయి)

పుట్లవరకు దిగుబడి నివ్వగలదు. అగ్గితెగులును బాగా తట్టుకొనగలదు. ఉల్లికోడు, టుంగ్రోవైరసులను తట్టుకొనలేదు. రైతులు ఈ రకాన్ని సాగుచేసి ఎకరానికి నాలుగు పుట్లవరకు దిగుబడి సాధించారు. ఆర్.-20కన్న మిన్నయైనదని నిరూపింప బడినది. గత సంవత్సరము (1991) ఈ రకాన్ని విడుదల చేయటంతో ఐ.ఆర్.-20కి ప్రత్యామ్నాయ రకం రైతాంగానికి అందించినట్లయింది. అయితే ఈ రకం ఐ.ఆర్.-20 కన్న 10-15 రోజులు ఆలస్యంగా కోతకు వచ్చినందున చెరువుల క్రింద చివరి పొలాలకు నీటి ఎద్దడి సంభవించే అవకాశముంది. ఈ సమస్యను కూడా పరిష్కరించేందుకు మరి రెండు రకాలు నెల్లూరు పరిశోధనా స్థానంలో రూపొందింప బడి, చిరు ప్రదర్శనలుగా పరీక్షింపబడుచున్నవి. ఆ రకాలు యన్.యల్.ఆర్-33057 మరియు యన్.యల్.ఆర్-33079

### యన్.యల్.ఆర్-33057, యన్.యల్.ఆర్-33079:

వీటి కాలపరిమితి 125రోజులు. దిగుబడి ఎకరాకు మూడు మూడున్నర పుట్లు ఇవ్వగలదు. గింజ నాణ్యత గల్గి భోజనమునకు అనువుగా యుండును. అగ్గితెగులు తట్టుకొనగలదు. ఆలస్యంగా నాట్లు వేయుటకు, చెరువు క్రింద చివరి పొలాలలో కూడా సాగుచేయుటకు అనువైనవి.గత రెండు సంవత్సరాలుగా రైతుల పొలాల్లో చిరు ప్రదర్శనలుగా ప్రదర్శింపబడుతూ మంచి దిగుబడుల నిస్తున్నాయి.

### ఐ.ఆర్-64

ఈ రకము కాలపరిమితి 120 రోజులు. ఎకరాకు మూడు మూడున్నర పుట్లు దిగుబడి నిస్తుంది. అగ్గితెగులును తట్టుకుంటుంది. కాని ఉల్లికోడు, మోము పిప్పి, దోమపోటు, టుంగ్రో వైరస్‌లను తట్టుకొనలేదు. గింజ నిద్రావస్థ(డార్మెన్సీ) కోత సమయంనుండి 3-4 వారములు యుండును.

### యం.టి.యు-4870

రబీ పంటకాలములో ఈ రకము కాలపరిమితి 135రోజులు. గింజ నాణ్యత గల్గి, ఎకరాకు మూడుపుట్ల దిగుబడి నిచ్చును. గింజ పంటపై తడిసినను మొలకెత్తదు. దోమ పోటును తట్టుకుంటుంది. అగ్గితెగులును ఒక మాదిరి తట్టుకొనగలదు. దోమపోటు ఎక్కువగా వచ్చే ప్రాంతాలకు అనువైనది.

### కో-43

ఈ రకము కాలపరిమితి 135రోజులు. గింజ నాణ్యత గల్గి ఎకరాకు మూడు పుట్ల దిగుబడి నివ్వగలదు. చౌడును తట్టుకొనే శక్తి యున్నందున చౌడు భూములకు అనువైనది. చెరువు క్రింది పొలాలకు, నీటి ఎద్దడి పరిస్థితులకు అనువైనది. అగ్గితెగులును కొంత వరకు తట్టుకొనును. మోము పిప్పి, ఎండాకు తెగులును కూడ కొంతవరకు తట్టుకొనును.

### యన్.యల్.ఆర్-3358:

ఈ రకము తక్కువ కాలపరిమితి (105-110రోజులు) గల్గి, చౌడును తట్టుకొనే శక్తి యున్నందున చౌడు భూములకు అనువైనది. గింజ అతిసన్నముగా యుండి దిగుబడి ఎకరాకు రెండున్నర పుట్లు నివ్వగలదు. అగ్గి తెగులును తట్టుకొనగలదు. ఈ రకము ప్రస్తుతం రైతుల పొలాల్లో చిరు ప్రదర్శనలుగా పరీక్షింప బడుచున్నది.

## దొంగపోలీసు

(9 పేజీ తరువాయి)

హాస్యం కోసం (బ్రహ్మానందాన్ని) అతనికి జోడిగా అనూజ అనే అమ్మాయిని సంధించారు. వీరి హాస్యంలో బాగా ద్వంద్వార్థాలు చోటు చేసుకున్నాయి. సత్యానంద్ సంభాషణలు బాగున్నా ఈ ద్వంద్వార్థపు పదాలు అతని పరువు తీశాయి.

విలన్లుగా కోట శ్రీనివాసరావు, భూషణ్‌లు పాత పద్ధతుల్లోనే నటించారు. హీరోయిన్ మమతా కులకర్ణి సన్నగా నాజూకుగా వుంది. ఈ చిత్రదర్శకుడే ఛాయా గ్రాహకుడు కూడా. జాలాది, రసరాజుల పాటల చిత్రీకరణ దృశ్యాలు చాలా సుందరంగా వున్నాయి.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd